## కర్తరి నిర్ణయము

**డొల్లుకర్తరి** : ది.04-05-2019 చైత్ర బహుళ అమావాస్య శనివారము నుండి, ది.11-05-2019 వైశాఖ శుక్ల సప్తమీ శనివారము వరకు డొల్లుకర్తరి ఉండును.

**నిజకర్తరి** : ది.11-05-2019 వైశాఖ శుక్ల సప్తమీ శనివారము నుండి, ది.29-05-2019 వైశాఖ బహుళ దశమీ బుధవారము వరకు నిజకర్తరి ఉండును.

**సూచన** : ఈ కర్తరి రోజులలో... అందునా నిజకర్తరిలో భూమి పూజ,కర్ర,ఇటుక,మట్టి,శిల,సిమెంట్,తాటాకు కప్పులు,రేకు కప్పులు, బావులు-చెఱువులు త్రవ్వుట,క్రొత్తవాహనములు కొనుట-నడుపుట చేయరాదు.

## మౌఢ్య నిర్ణయము

**గురుమూఢమి** : ది.12-12-2019 మార్గశిర శుక్ల పూర్ణిమ(తత్కాల బహుళ పాడ్యమీ) గురువారము నుండి, ది.11-01-2020 పుష్య బహుళ పాడ్యమి(తత్కాల విదియ) శనివారము వరకు పశ్చాదస్తమిత గురుమూఢమి.

**శుక్రమూఢమి** : ది.8-07-2019 ఆషాఢ శుక్ల షష్ఠీ(తత్కాల సప్తమీ) సోమవారము నుండి, ది.19-09-2019 భాద్రపద బహుళ పంచమీ (తత్కాల షష్ఠీ) గురువారము వరకు ప్రాగస్తమిత శుక్రమూఢమి.

**సూచన** : గురు-శుక్ర మౌఢ్య దినములలో వివాహాది శుభకార్యములు,నూతన వస్తు-వస్త్ర-వాహన-భూషణ ధారణలు చేయరాదు.

## పుష్కర నిర్ణయము

ది.5-11-2019 కార్తీక శుక్ల నవమీ జయవారము రాత్రి గం॥ 6-25 ని॥లకు **"సౌరచంద్ర జ్యోతిర్గణిత తంత్రమ్"** (అముద్రితము) గ్రంథోక్త అయనాంశములచే గురుడు ధనుస్సురాశి ప్రవేశము చేయుచున్నాడు. కావున ది.5-11-2019 జయవారము నుండి 12 రోజుల పాటు అనగా ది.16-11-2019 శనివారము వరకు **"శ్రీ పుష్కరణీ" నదీ పుష్కరోత్సవములు** జరుగును.

**పుష్కరప్రదేశము** : అజ్మీర్ (రాజస్థాన్)





## చాంద్రమానాబ్ద ఫలము

చాంద్రమానమున ఈ సంవత్సరము ప్రభవాది 33 వది శ్రీ **"వికారి"** నామ సంవత్సరము అగుట వలన... ప్రజలకు వివిధ రోగభయములు ఏర్పడును. దురాశలు-వ్యసనములు తగ్గుముఖము పట్టును. వర్షాకాలమున వర్షములు బాగుగా వర్షించును. వరదలు కరువులు ఏర్పడును. పంటలు సమృద్ధిగా ఫలించును. చైత్ర-వైశాఖ-ఆశ్వయుజ-ఫాల్గుణ మాసములందు ధాన్యములకు-వస్తువులకు ధరలు హెచ్చును.

## బార్హస్పత్యమానాబ్ద ఫలము

బార్హస్పత్యమానమున ఈ సంవత్సరము ప్రభవాది 46 వది **"పరీధావి"** నామ సంవత్సరము అగుట వలన... వస్తువులకు వెలలు తక్కువగును. జనులకు-పశుపక్ష్యాదులకు రోగభయములు కలుగును. వర్షములు సామాన్యముగా కురియును. ధాన్యములకు ధరలు హెచ్చును. లోహాదులకు ధరలు తగ్గును. సరిహద్దు దేశములతో యుద్ధవాతావరణములు నెలకొనును.

## గురూదయాబ్ద ఫలము

గురూదయవశమున ఈ సంవత్సరము **"ఆషాఢాబ్దము"** అగుట వలన... అన్ని పంటలకు పీడ కలుగును. క్రిమి-కీటకాదుల బెడద ఉండును. రెండవ పంట మరియు మెట్ట పంటలు బాగుగా ఫలించును.

## గ్రహణ నిర్ణయము



**1.అర్ధాధిక గ్రాస చంద్రగ్రహణము** : ది.16-07-2019 ఆషాఢ శుక్ల పూర్ణిమా మంగళవారము కేతుగ్రస్త అర్ధాధిక గ్రాస చంద్రగ్రహణము సంభవ మగును. దక్షిణగోళము(చంద్రుడు). దక్షిణశరము. గ్రాసము 66/100.

గ్రహణ స్పర్శకాలము : రాత్రి గం॥ 1-31 ని॥లు IST AM (17-07-2019)

గ్రహణ మధ్యకాలము : రాత్రి గం॥ 3-01 ని॥లు IST AM (17-07-2019)

గ్రహణ మోక్ష కాలము : రాత్రి గం॥ 4-30 ని॥లు IST AM (17-07-2019)

గ్రహణ ఆద్యంత పుణ్యకాలము : గం॥ 2-59 ని॥లు.

**సూచన :** ఈ చంద్రగ్రహణము ఉత్తరాషాఢ నక్షత్రము నందు సంభవించుట వలన ఉత్తరాషాఢ నక్షత్ర జాతకులు, ధనుస్సురాశి మరియు మకరరాశి నందు జన్మించిన వారు గ్రహణమును చూడరాదు. మరుదినము శివాలయము నందు శాంతి చేయించుకొనుట మంచిది.



**2.త్రిపాదాధిక గ్రాస సూర్యగ్రహణము :** ది.26-12-2019 మార్గశిర బహుళ అమావాస్య గురువారము నాడు, కేతుగ్రస్త త్రిపాదాధిక గ్రాస సూర్యగ్రహణము సంభవించును. దక్షిణగోళము(సూర్యుడు). దక్షిణ(స్ఫుట) శరము. గ్రాసము 77/100.

| | | |
|---|---|---|
| గ్రహణ స్పర్శకాలము | : ఉదయం గం॥ 8-11 ని॥లు | IST AM |
| గ్రహణ మధ్యకాలము | : ఉదయం గం॥ 9-36 ని॥లు | IST AM |
| గ్రహణ మోక్ష కాలము | : పగలు గం॥ 11-21 ని॥లు | IST AM |
| గ్రహణ ఆద్యంత పుణ్యకాలం | : గం॥ 3-10 ని॥లు. | |

**సూచన :** ఈ సూర్యగ్రహణము మూలా నక్షత్రము నందు సంభవించుట వలన మూలా నక్షత్ర జాతకులు, మరియు ధనుస్సురాశి నందు జన్మించిన వారు గ్రహణమును చూడరాదు. మరుదినము శివాలయము నందు శాంతి చేయించుకొనుట మంచిది.

**శాంతి విధానము :** గ్రహణ శాంతి ఆవశ్యము గలవారు వెండి/రాగితో సూర్య/చంద్రబింబమును మరియు సర్పప్రతిమను చేయించి, రాగి లేదా కంచు పాత్రలో నెయ్యి పోసి ఆ పాత్రనందు సూర్య/చంద్రబింబమును మరియు నాగ ప్రతిమను ఉంచవలెను. తిల-తండూలములతో కూడిన మరొక పాత్రనందు ఈ కంచు లేదా రాగిపాత్రను ఉంచి... "మమ జన్మరాశి, జన్మనక్షత్ర, అరిష్టస్థాన గ్రహణ సంభవ సూచిత సర్వారిష్ట దోష నివారణార్థం, మమ జన్మరాశ్యాత్ ఏకాదశ స్థాన స్థిత గ్రహణ సంభవ సూచిత సర్వ శుభఫల ప్రాప్త్యర్థ్యం ఇతి బింబదానము కరిష్యామి." అను సంకల్పముతో సూర్య/చంద్ర- రాహు-కేతువులను స్మరించుకుని... "తమోమయ మహాభీమ సోమ సూర్య విమర్దన హేమతారా ప్రదానేన మమ శాంతి ప్రధోభవ విధుంతుద నమస్తుభ్యం సింహికానంద నాచ్యుత దానే అనానేన నాగస్య రక్షమాం వేదజాత్భయాత్" అను మంత్రమును స్మరించి నాగప్రతిమ మరియు సూర్య/చంద్ర బింబముతో కూడిన రాగి లేదా కంచు పాత్రను శివాలయము నందు బ్రాహ్మణులకు దానము చేయవలెను.

**గమనిక:** సూర్యగ్రహణ దోషము గలవారు సూర్యబింబమును, చంద్రగ్రహణ దోషము గలవారు చంద్రబింబమును సమర్పించవలెను.





## శ్రీవికారి నామ సంవత్సరము 2019- 20 వర్ష కార్తెలు - ఫలితములు

| కార్తెలు | ప్రవేశతేది | ఫలితసూచనలు |
|---|---|---|
| 1. అశ్విని | ది. 14-04-2019 | ఉష్ణగాలులు. మేఘచలనములు. స్వల్పజల్లులు. పిడుగుపాటులు. ప్రతికూల వాతావరణం. |
| 2. భరణి | ది. 28-04-2019 | ఆకస్మిక వాతావరణమార్పులు. కొన్నితావుల గాలులతో కూడిన వర్షములు. మేఘములు. |
| 3. కృత్తిక | ది. 11-05-2019 | గాలులతో కూడిన వర్షములు. కొన్నితావుల తీవ్ర అగ్నిప్రమాదములు. పగటి ఉష్ణోగ్రతలు. |
| 4. రోహిణి | ది. 25-05-2019 | కొన్నితావుల అతివృష్టి-మరికొన్ని తావుల అనావృష్టి. ఆకస్మిక విచిత్ర వాతావరణములు. |
| 5. మృగశిర | ది. 08-06-2019 | గాలులతో కూడిన అల్పవృష్టి. అటవీప్రాంత వర్షములు. కొన్నితావుల మెరుపులు-పిడుగులు. |
| 6. ఆరుద్ర | ది. 22-06-2019 | స్వల్ప వర్షములు. దట్టమైన మేఘచలనములు. ఉరుములు-పిడుగులతో కూడిన వాతావరణం. |
| 7. పునర్వసు | ది. 06-07-2019 | సామాన్య వర్షపాతము. ఆకస్మిక వాతావరణ మార్పులు. కొన్నితావుల భారీ వర్షములు. |
| 8. పుష్యమి | ది. 20-07-2019 | దట్టమైన మేఘచలనములు. గాలులతో కూడిన స్వల్ప వర్షములు. పర్వతప్రాంత వృష్టి. |
| 9. ఆశ్లేష | ది. 03-08-2019 | సామాన్య వర్షములు. కొన్నితావుల భారీ వర్షములు. అల్పపీడనము. పంటలకు అనుకూలము. |
| 10. మఖ | ది. 17-08-2019 | మొత్తముమీద సామాన్య వర్షపాతము. కొన్నితావుల స్వల్ప వర్షము. రాత్రిపూట వర్షములు. |
| 11. పుబ్బ | ది. 31-08-2019 | అనావృష్టి. పంటనష్టములు. ప్రతికూల వాతావరణము. గాలులు. స్వల్పజల్లులు. మేఘాలు. |
| 12. ఉత్తర | ది. 13-09-2019 | పర్వతప్రాంత వర్షములు. అతి లేక అనావృష్టి. ప్రతికూల వాతావరణము. శీతగాలులు. |
| 13. హస్త | ది. 27-09-2019 | పర్వతప్రాంత వృష్టి. గాలులతో కూడిన స్వల్ప వర్షములు. అరటి-చెఱకు పంటలు నష్టము. |
| 14. చిత్త | ది. 11-10-2019 | అల్పపీడనము. ఆకస్మిక భారీ వర్షములు. పశ్చిమదిశా గాలులు. ప్రతికూల వాతావరణము |
| 15. స్వాతి | ది. 24-10-2019 | అల్పపీడనము. తుఫాన్. ప్రతికూల వాతావరణము. అటవీప్రాంత వర్షములు. పంట నష్టం. |
| 16. విశాఖ | ది. 06-11-2019 | తుఫాన్ ప్రమాదములు. పెనుగాలులతో కూడిన వర్షములు. పశుపక్ష్యాది పంట నష్టములు. |
| 17. అనురాధ | ది. 20-11-2019 | గాలులతో కూడిన భారీ వర్షములు. అల్పపీడనము లేదా పెనుతుఫాన్. ఆస్తి-ప్రాణ నష్టాలు. |
| 18. జ్యేష్ఠ | ది. 03-12-2019 | పగటి ఉష్ణోగ్రతలు పెరుగును. రాత్రుళ్ళు చలి ఎక్కువగును. పిడుగులు-ఉరుములు-జల్లులు. |

## నవనాయక ఫలములు

**1.రాజు-శని :** శ్రామిక గ్రహము రాజగుట వలన... పరిపాలనలో బడుగు బలహీన వర్గాలవారికి ప్రాధాన్యత. ప్రభుత్వము నూతన సంస్కరణలు చేపట్టును. రక్షణవ్యవస్థకు అధిక ప్రాధాన్యత ఇవ్వబడును. పాలకునికి తరచుగా అనారోగ్యములు-గండములు కలిగిననూ రాజు శత్రువులను అణచివేయును. జూలై-డిసెంబర్ నెలలందు ప్రభువుకు ప్రమాదములు జరుగును. ఈ సంవత్సరము శని, పూర్వాషాఢ-ఉత్తరాషాఢ నక్షత్రములందు సంచరించుటచే జరగబోవు ఎన్నికలందు ఈ నక్షత్రములందు జన్మించిన వారు గాని వీటి త్రికనక్షత్రాలలో జన్మించినవారు గాని ముఖ్యమంత్రి అగును.

**2.మంత్రి-రవి :** రాచరిక గ్రహము మంత్రి అగుట వలన... మంత్రులకు పూర్తి స్వేచ్ఛాధికారములు కలుగును. మంత్రులు పనితీరు నీతివంతముగా ఉండును. రాజుకు మంత్రులకు మధ్య విభేదములు వచ్చును. అక్టోబర్-మార్చ్ నెలలందు మంత్రులకు ఇబ్బందులు కలుగును.

**3.సేనాధిపతి-శని :** శ్రామిక గ్రహము సేనాధిపతి అగుట వలన... రక్షణ వ్యవస్థ పటిష్టమగును. హోంశాఖ పనితీరు బాగుంటుంది. పోలీసుల డ్రస్‌కోడ్‌లో మార్పులు రావచ్చు. రక్షణ వ్యవస్థనందు సంస్కరణలు వచ్చును. జూలై లేదా డిసెంబర్ నెలలందు అలజడి-ఆందోళనలు ఉండును.

**4.సస్యాధిపతి-బుధ :** వాతావరణ ప్రతికూలతల వలన, పెనుగాలుల వలన పంటనష్టములు జరుగును. పంటలకు క్రిమికీటకాది బాధలు అధికమగును. సెప్టెంబర్-ఫిబ్రవరి నెలలందు రైతులు జాగ్రత్తగా ఉండవలెను. కొన్ని ప్రాంతములందు తుఫానులచే నష్టములు ఉండును.

**5.ధాన్యాధిపతి-చంద్ర :** మొదటి పంట కంటే రెండవ పంట బాగుగా ఫలించును. మెట్టపంటలు లాభసాటిగా ఉండును. ధాన్యములకు గిట్టుబాటు ధరలు లభించును. రైతులకు కోల్డ్‌స్టోరేజ్ సదుపాయములు చేకూరును. తెల్లని గింజలు-ప్రత్తి-బియ్యము-చెఱకు-అరటి వివిధ పండ్ల జాతులు విరివిగా ఫలించును.

**6.అర్ఘ్యాధిపతి-శని :** వస్తుధరలు నిలకడగా ఉండవు. తరచూ హెచ్చు తగ్గులతో మార్కెట్ నడుచును. జంతు-జీవములకు-ఉన్నికి-మాంసాదులకు-ఇనుముకు-సిమెంట్‌కు-ఆహారపదార్ధములకు ధరలు హెచ్చును.

**7.మేఘాధిపతి-శని :** వర్షాలు తక్కువగా కురియును. జూలై-సెప్టెంబర్-అక్టోబర్ నెలలందు కొన్నిప్రాంతములలో మాత్రము భారీనుండి అతిభారీ వర్షములు కురియును. ఈ సంవత్సరము వర్షముల కంటే మేఘాడంబరములు-పెనుగాలులు-పిడుగులు-వడగండ్లు అధికమగును. శీతాకాలమునందు చలిగాలులు-పొగమంచు ఎక్కువగును. వాతావరణ మూలకముగా సామూహిక ప్రమాదములు జరుగును.





**8.రసాధిపతి-శుక్ర :** రసవస్తువులకు గిరాకీ ఏర్పడును. బెల్లము-పంచదార-తేనె-నెయ్యి-చింతపండు-నిమ్మకాయలు-ద్రాక్షలు-కమలాలు-మామిడి మొదలగు పండ్లకు ధరలు హెచ్చును. అలంకార-విలాస-శృంగార వస్తువులు అధికమగును.

**9.నీరసాధిపతి-బుధ :** కంచువస్తువులకు, పంచలోహములకు విలువ పెరుగును. నూతన యంత్రపరికములు వృద్ధియగును. మనుష్యుల స్థానే యంత్రములకు విలువ పెరుగును. రోబోల వినిమయం జరుగును. సమాచార రంగములందు విప్లవాత్మక మార్పులు చోటుచేసుకొనును.

## సంక్రాంతి పురుషుడు - "మందాకిని" నామధేయుడు



ది. 14-01-2020 శ్రీ **"వికారి"** నామ సంవత్సర పుష్యమాస బహుళ పక్ష పంచమీ జయవారము పుబ్బా నక్షత్ర, శోభన యోగ, తైతుల కరణ యుక్త ధనుర్ లగ్నము నందు తెల్లవారుజాము గం॥ 4-46 ని॥లకు **"మందాకిని"** నామధేయుడైన **సంక్రాంతి పురుషుడు** (శ్రీ సూర్యభగవానుడు) **గార్ధభ** వాహనారూఢుడై **మకరరాశి** ప్రవేశము చేయును.

**"మందాకిని"** నామము వలన రాజులకు హాని. **కుంకుమ** స్నానముచే శుభము. **చిత్రవర్ణ** వస్త్ర ధారణచే శుభకరము. **గోరోచన** గంధ లేపనముచే శ్రేయస్సు. **ఇనుప** పాత్రలో భుజించుటచే శుభము. **నేరేడుపండు** తినుట వలన జంతువులకు మేలు. **అప్పములు** భుజించుటచే స్ఫోటకభయం. **గాడిద** వాహనము నెక్కుటచే రోగభయము. **నిద్రావస్థలో** ఉండుట వలన పంట నష్టములు. **వైరాగ్య** ముఖముచే సువృష్టి. **నలుపు** గొడుగు ధరించుటచే రోగభయములు. **మల్లి** పుష్ప ధారణచే శుభప్రదము. **వజ్రమణి** ధారణచే అనావృష్టి. **దంత** ఆయుధ ధారణచే పశునష్టములు. **పశ్చిమ** దిశాగమనముచే పశ్చిమ ప్రాంతములందు, దేశములందు కరువు ఏర్పడును.

**బహుళ పక్షము**లో వచ్చుటచే సుభిక్షము. **పంచమీ** తిథిచే జయము. **మంగళవారము** ప్రవేశమగుటచే రోగము. **పుబ్బా** నక్షత్రము వలన వర్షలేమి. **శోభనయోగము**చే శోభస్కరము. **తైతుల కరణము**చే సువృష్టి. **ధనుర్ లగ్నము**చే అల్పసుఖము. **తెల్లవారుజాము** ప్రవేశముచే శుభము.

**ఈ మకర సంక్రమణ ఉత్తరాయణ పుణ్యకాలమందు ప్రజలు తమ యథాశక్తి నవధాన్యములు, కూష్మాండాది సువర్ణ దానములు, అన్నదానములు, గోదానములు చేసిన ఎడల దోష ఫలముల తీవ్రత నశించి సకల జనులకు శుభము జరుగును.**

ఆదాయ-కందాయ ఫలముల కంటే గోచార ఫలములు ముఖ్యమైనవి.



## ద్వాదశ రాశులకు ఆదాయ-వ్యయాదులు

| రాశులు | రాబడి | పోబడి | రాశులు | కీర్తి | అపకీర్తి |
|---|---|---|---|---|---|
| మేషరాశి | 14 | 14 | మేషరాశి | 3 | 6 |
| వృషభరాశి | 8 | 8 | వృషభరాశి | 6 | 6 |
| మిధునరాశి | 11 | 5 | మిధునరాశి | 2 | 2 |
| కర్కాటకరాశి | 5 | 5 | కర్కాటకరాశి | 5 | 2 |
| సింహరాశి | 8 | 14 | సింహరాశి | 1 | 5 |
| కన్యారాశి | 11 | 5 | కన్యారాశి | 4 | 5 |
| తులారాశి | 8 | 8 | తులారాశి | 7 | 5 |
| వృశ్చికరాశి | 14 | 14 | వృశ్చికరాశి | 3 | 1 |
| ధనుస్సురాశి | 2 | 8 | ధనుస్సురాశి | 6 | 1 |
| మకరరాశి | 5 | 2 | మకరరాశి | 2 | 4 |
| కుంభరాశి | 5 | 2 | కుంభరాశి | 5 | 4 |
| మీనరాశి | 2 | 8 | మీనరాశి | 1 | 7 |

**సర్వ ఆదాయము = 93, సర్వ వ్యయము = 93, దేశ కీర్తి = 45, దేశ అపకీర్తి = 48**

## కందాయ ఫలములు

| నక్షత్రము | ప్రథమ | ద్వితీయ | తృతీయ | నక్షత్రము | ప్రథమ | ద్వితీయ | తృతీయ |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 0 | 1 | 2 | స్వాతి | 2 | 0 | 4 |
| భరణి | 3 | 2 | 0 | విశాఖ | 5 | 1 | 2 |
| కృత్తిక | 6 | 0 | 3 | అనురాధ | 0 | 2 | 0 |
| రోహిణి | 1 | 1 | 1 | జ్యేష్ఠ | 3 | 0 | 3 |
| మృగశిర | 4 | 2 | 4 | మూల | 6 | 1 | 1 |
| ఆరుద్ర | 7 | 0 | 2 | పూర్వాషాఢ | 1 | 2 | 4 |
| పునర్వసు | 2 | 1 | 0 | ఉత్తరాషాఢ | 4 | 0 | 2 |
| పుష్యమి | 5 | 2 | 3 | శ్రవణము | 7 | 1 | 0 |
| ఆశ్లేష | 0 | 0 | 1 | ధనిష్ఠ | 2 | 2 | 3 |
| మఖ | 3 | 1 | 4 | శతభిషము | 5 | 0 | 1 |
| పుబ్బ | 6 | 2 | 2 | పూర్వాభాద్ర | 0 | 1 | 4 |
| ఉత్తర | 1 | 0 | 0 | ఉత్తరాభాద్ర | 3 | 2 | 2 |
| హస్త | 4 | 1 | 3 | రేవతి | 6 | 0 | 0 |
| చిత్త | 7 | 2 | 1 | - | - | - | - |

**సూచన :** ఒక్కొక్క కందాయము సంవత్సరాది లగాయతు నాలుగు మాసములు ఉండును. ఇందలి బేసిసంఖ్యలు ధనలాభమును, సరిసంఖ్యలు సమఫలమును, సున్న శూన్యఫలమును ఇచ్చును.



ఈ సంవత్సరము ఆంధ్రదేశమునందు అగ్ని-జల-వాహన ప్రమాదములు.



## శ్రీ వికారి లో ఆంధ్రప్రదేశ్ భవిష్యత్

| | | | |
|---|---|---|---|
| | శుక్ర 17° కేతు 02° | రవి 23° | బుధ(వ) 09° గురు 28° |
| లగ్నము 16° | **నవ్యాంధ్రప్రదేశ్ ఆవిర్భావ కుండలి 8-06-2014 ఆదివారము గం॥ 00.00 అమరావతి** | | |
| | | | |
| | | రాహు 02° శని(వ) 24° | చంద్ర 14° కుజ 17° |

| | | | |
|---|---|---|---|
| రవి 21° చంద్ర21° | | కుజ 09° | రాహు 28° |
| బుధ24° శుక్ర17° | **వర్షలగ్నకుండలి 5-04-2019 శుక్రవారము మధ్యాహ్నము 2-23 అమరావతి** | | లగ్నము 25° |
| | | | |
| కేతు 28° శని 26° గురు00° | | | |

వర్తమానమున ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమునకు చంద్రమహాదశ నడుస్తున్నది. ఇందు ప్రస్తుతము శుక్ర భుక్తి నడుస్తున్నది. శుక్రుడు చతుర్థ-భాగ్యాధిపతిగా తృతీయ భావమునందు కేతు కక్ష్య నందు ఉండుటచే...ఈ సంవత్సరము ఆర్థికాభివృద్ధి ఉంటుంది. నూతన ఆర్థిక సంస్కరణలు జరుగును. వినోదపు పన్నులు అధికమగును. ముఖ్యమంత్రికి-రక్షణమంత్రికి-పోలీస్ ప్రముఖులకు-రాష్ట్రమునకు చెందిన సైనికులకు ప్రమాదములు పొంచి ఉన్నవి. చలన చిత్ర ప్రముఖులు రాజకీయముగా రాణించెదరు. చిత్రపరిశ్రమకు చెందిన ప్రముఖులకు మరియు ప్రముఖ మీడియా సంస్థాధిపతికి గండములున్నవి.

ఈ సంవత్సరము అగ్ని-జల-వాహన ప్రమాదములు ఎక్కువగా ఉండ వచ్చు. ప్రసార-ప్రచార-సమాచార వ్యవస్థలందు అలజడులు చెలరేగును. రాయలసీమ మరియు ఉత్తరాది జిల్లాలందు వేర్పాటు వాదములు బలపడును. ప్రతికూల వాతావరణముచే పంటలు నష్టపడును. పశ్చిమ ప్రాంతములలో భూమి కంపించును.

నవ్యాంధ్రప్రదేశ్ లగ్నమునకు వర్షకుండలి లగ్నము 6వది అగుటయు, జన్మలగ్న కక్ష్యాధిపతి వర్షలగ్నమునకు 9దింట ఉండుట వలన, మరియు లగ్న-వ్యయాధిపతి అయిన శని బుధకక్ష్యలో ఉన్నాడు. అట్టి బుధుడు వర్షలగ్న కుండలినందు 8దింట ఉండుట వలన... రాష్ట్ర సాధారణ పరిస్థితులు శుభాశుభ మిశ్రమ ఫలితములను ఇచ్చును. ప్రజలు అనారోగ్యముతోను, ప్రతికూల వాతావరణముతోను ఇబ్బందులు పడుదురు. ప్రజలు మానసికముగాను, చర్మ మరియు బుద్ధి సంబంధిత రుగ్మతలతో బాధ పడుదురు.

ప్రస్తుత ప్రభుత్వ పనితీరు ప్రజలకు ఆమోదయోగ్యముగా సాగును.



ధన-లాభాధిపతి అయిన గురుడు శనికక్ష్యలో ఉన్నాడు. అట్టి శని వర్షలగ్న కుండలినందు సప్తమ-అష్టమాధిపతిగా 6రింట కుజకక్ష్యలోను, గురునాడిలోను సంచరించుట వలన... రాష్ట్ర ఆర్థిక పరిస్థితులు సామాన్యముగా ఉండును. వినోదపు పన్నులు పెరుగును. విదేశీ ద్రవ్య లాభములు లేదా నూతన ఋణ సదుపాయములు లాభించును. షేర్ మార్కెట్ సామాన్యముగా నడుచును. నూతన వ్యాపారాత్మక సంస్కరణలు అమలులోకి వచ్చును. పెట్రోలియం-బంగారము ధరలు మరింతగా పెరుగును.

తృతీయ-రాజ్యాధిపతి అయిన కుజుడు, స్వకక్ష్యలో ఉన్నాడు. అట్టి కుజుడు వర్షలగ్న కుండలి నందు పంచమ-రాజ్యాధిపతిగా 11డింట చంద్ర కక్ష్యలోను, రవినాడిలోను సంచరించుటవలన... నూతన ప్రభుత్వ పనితీరు చక్కగా ఉండును. ఈ కుజుడు వర్షలగ్న కుండలి నందు కృత్తికా నక్షత్రములో సంచరించుట వలన, కృత్తిక-ఉత్తర-ఉత్తరాషాఢ నక్షత్రములో జన్మించిన వ్యక్తులు అధికారము వశపరచుకొందురు. ఈ సంవత్సరము వైజాగ్ రైల్వేజోన్ పనులు మరియు నూతన రైలు మార్గముల అభివృద్ధి పనులు ముందుకు సాగును. మీడియా వ్యవస్థలు సమాజమునకు జవాబుదారీగా ఉండే విధముగా మీడియా వ్యవస్థలపై ఆంక్షలు అమలగును.

చతుర్థ-భాగ్యాధిపతి అయిన శుక్రుడు కేతుకక్ష్యలో ఉన్నాడు. అట్టి కేతువు వర్షలగ్న కుండలి నందు, 6రింట రాహుకక్ష్యలోను-సూర్యనాడిలోను సంచరించుట వలన... ప్రతికూల వాతావరణముచే ప్రజలు అవస్థలు పడుదురు. కొన్నితావుల భూమి కంపించును. తుఫాన్ మరియు వరద ముప్పులు తటస్థించును. ఉత్తరకోస్తా జిల్లాలవారు జాగ్రత్తగా ఉండవలెను. కొన్నిచోట్ల స్వల్ప మతఘర్షణలు చెలరేగును. యజ్ఞ-యాగాది క్రతువులు ఎక్కువగును.

పంచమ-అష్టమాధిపతి అయిన బుధుడు శుక్రకక్ష్యలో ఉన్నాడు. అట్టి శుక్రుడు వర్షలగ్న కుండలి నందు చతుర్థ-లాభాధిపతిగా 8దింట చంద్ర కక్ష్యలోను, గురునాడిలోను సంచరించుట వలన... విద్యార్థులకు ప్రమాదములు జరుగును. కొన్ని పాఠశాలలు-కళాశాలలు గుర్తింపు రద్దగును. ఘోరమైన జల ప్రమాదములో విద్యార్థులు చిక్కుకొను అవకాశములు ఉన్నవి. "సి-డి-యస్" అక్షరాలతో పేర్లు మొదలయ్యే ప్రముఖులకు-కళాకారులకు-నటీనటులకు ప్రమాదములు ఉండును. తెలుగు చలనచిత్ర పరిశ్ర



కొన్ని పాఠశాలల మరియు కళాశాలల గుర్తింపులు రద్దగును.



మకు మంచికాలము కాదు.

షష్ఠాధిపతి అయిన చంద్రుడు స్వకక్ష్యలో ఉన్నాడు. అట్టి చంద్రుడు వర్షలగ్న కుండలి నందు, లగ్నాధిపతిగా స్వకక్ష్యలోను-బుధనాడిలోను సంచరించుట వలన... రక్షణ మరియు వైద్య వ్యవస్థలలో నూతన సంస్కరణలు చేయుదురు. స్త్రీలకు ఆయా రంగములనందు అధిక ప్రాధాన్యత ఇవ్వబడును. పశు-జల సంపదలు వృద్ధి యగును.

సప్తమాధిపతి అయిన సూర్యుడు శనికక్ష్యలో ఉన్నాడు. అట్టి శని వర్షలగ్న కుండలి నందు, సప్తమ-అష్టమాధిపతిగా 6రింట కుజకక్ష్యలోను-గురునాడిలోను సంచరించుట వలన... ప్రముఖ కళాకారులకు-రాజకీయ నాయకులకు ప్రమాదములు జరుగును. ప్రభుత్వ వ్యతిరేక కుట్రలు చేయుదురు. ప్రముఖుల రహస్య జీవితాలు రచ్చకెక్కును. వైవాహిక సమస్యలు అధికము.

**2019 ఏప్రిల్ :** ఆకస్మిక వాతావరణ మార్పులు. ఎన్నికల కోలాహలమందు ప్రముఖులకు ప్రమాదములు. స్వల్ప మతఘర్షణలు. ప్రముఖులు యజ్ఞ-యాగాదులు చేయుదురు. ప్రముఖ న్యాయమూర్తి లేక పండితుడు కాలము చేయును. ప్రముఖులకు కోర్టుచిక్కులు. దొంగల భయములు.

**మే :** రాజకీయముగా విప్లవాత్మక మార్పు. కొత్తవారు అధికారమును పొందెదరు. రెండవ వారము నుండి రికార్డుస్థాయి ఉష్ణోగ్రతలు. వివిధ కారణములచే జన-జంతు నష్టములు. అగ్ని-వాహన-జల ప్రమాదములు. ప్రముఖుడొకరు మరణించును. పాముకాటు వలన మరణాలు కలుగును.

**జూన్ :** ప్రతికూల వాతావరణము. ప్రజలకు శారీరక-మానసిక సమస్యలు అధికమగును. మూడవ వారము నుండి ఆకస్మిక వాతావరణ మార్పులు. అల్పపీడనము లేదా తుఫాన్ ఏర్పడవచ్చు. క్వారీలందు ప్రమాదములు జరుగును. రోడ్డు-రైలు ప్రమాదములు ఉండును. రాజకీయ కుట్రలు.

**జూలై :** కొన్నితావుల అతివృష్టి మరికొన్నితావుల అనావృష్టి. రైతులకు ప్రతికూల వాతావరణము. ప్రముఖ దేవాలయాల వద్ద అపశృతులు. క్షుద్ర పూజల కలకలలు. ప్రముఖులకు కోర్టుపరమైన శిక్షలు. సముద్రతీర ప్రాంతీయులు జాగ్రత్తగా ఉండవలెను. చాలాచోట్ల పెనుగాలుల వలన నష్టములు.

**ఆగస్ట్ :** భారీ వర్షములు కురియును. వరద ప్రమాదములు ఉన్నాయి. కర్నూలు-నెల్లూరు-అనంతపురం-పశ్చిమగోదావరి జిల్లాలవారికి వాతావరణ మూలక నష్టములు. ప్రభుత్వ తక్షణ సహకారములు. నిత్యావసర వస్తు

ధరలు అదుపు చేయుదురు. నూతన ఆర్థిక సంస్కరణలు అమలగును.

**సెప్టెంబర్ :** ప్రముఖులు ఇబ్బందులు ఎదుర్కొందురు. కొన్నితావుల భూమి కంపించును. వాతావరణ దుర్యోగములు. నదీతీరప్రాంత ప్రజలు జాగ్రత్తగా ఉండవలెను. పశ్చిమగోదావరి జిల్లాలో అలజడి-ఆందోళనలు. పోలీసు ప్రముఖులకు ఇబ్బందులు. రోడ్డు-రైలు ప్రమాదములు జరుగును.

**అక్టోబర్ :** అల్పపీడనము లేదా తుఫాన్ ఏర్పడును. అధికారపార్టీ వ్యక్తులకు ఇబ్బందులు వచ్చును. ప్రముఖుల మరణము దిగ్భ్రాంతి. రోడ్డు-రైలు ప్రమాదములు జరుగును. నూతన పత్రికలు లేదా ఎలక్ట్రానిక్ మీడియాలు ఏర్పడును. వాతావరణములో చలిగాలుల తీవ్రత పెరుగును. ఆందోళనలు.

**నవంబర్ :** ప్రతికూల వాతావరణము. పంటలు పాడగును. ప్రముఖుల ఇంట అపశృతులు. ప్రజలకు అనారోగ్యములు. ఆర్థిక కుంభకోణములు. రైల్వేజోన్ లేదా నూతన రైలుమార్గముల అభివృద్ధి. విదేశీ ప్రముఖుల రాక. అల్పపీడనము లేదా తుఫాన్. సముద్ర-నదీతీర ప్రాంతీయులు జాగ్రత్త.

**డిసెంబర్ :** చాలా ప్రాంతములందు అలజడులు-ఆందోళనలు జరుగును. భారీ రోడ్డు లేదా రైలు ప్రమాదములు జరుగును. చలితీవ్రత ఎక్కువగును. మునుపెన్నడూ చూడని చలిగాలులు విజృంభించుటచే ప్రాణనష్టాలు. పాలకుల విదేశీ ప్రయాణములు. నిత్యావసర వస్తుధరలు పెరుగును.

**2020 జనవరి :** అంటువ్యాధులు ప్రబలు అవకాశములున్నవి. మత సంబంధిత ఘర్షణలు చెలరేగును. ప్రముఖ దేవాలయాల వద్ద భద్రత అవసరము. ప్రముఖులు వాహన ప్రమాదాలలో చిక్కుకొందురు. ఆకస్మిక వాతావరణ మార్పులచే పంట నష్టములు. కొన్నితావుల భూప్రకంపనలు.

**ఫిబ్రవరి :** అనుకూల వాతావరణము ఉన్ననూ కొన్నితావుల ఆకస్మిక వర్షములు కురియును. ప్రముఖ రాజకీయ నాయకుడు మరణించును. రాజకీయ నాయకుల పిల్లలు ప్రమాదాలలో ఇరుక్కొందురు. శుభకార్యములు రికార్డుస్థాయిలో జరుగును. అధికార పక్షమునకు ఇబ్బందులు.

**మార్చ్ :** కొన్నితావుల భూమి కంపించును. పాలకునికి ప్రమాదములు పొంచి ఉన్నవి. రాజకీయపరమైన కుట్రలు వెలుగుచూచును. విద్యార్థులు ప్రమాదములో ఇరుక్కొందురు. కొన్నిచోట్ల పుకార్లు వ్యాపించును. చాలా చోట్ల పెనుగాలులు వీచును. కొన్నితావుల వడగండ్లు-పిడుగులు పడును.







# శ్రీ వికారి లో తెలంగాణ భవిష్యత్

| | | | |
|---|---|---|---|
| | శుక్ర 11° కేతు 02° | రవి 18° | బుధ 08° గురు 26° |
| లగ్నము 06° | **తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావ కుండలి 2-06-2014 సోమవారము గం॥ 00.00 హైదరాబాద్** | | చంద్ర 02° |
| | | | |
| | | రాహు 02° శని(వ) 24° | కుజ 16° |

| | | | |
|---|---|---|---|
| రవి 21° చంద్ర 21° | | కుజ 09° | రాహు 28° |
| బుధ 24° శుక్ర 17° | **వర్షలగ్నకుండలి 5-04-2019 శుక్రవారము మధ్యాహ్నము 2-23 హైదరాబాద్** | | లగ్నము 23° |
| | | | |
| కేతు 28° శని 26° గురు 00° | | | |

వర్తమానమున తెలంగాణా రాష్ట్రమునకు శని మహాదశలో బుధ భుక్తి నడుస్తున్నది. బుధుడు పంచమ-అష్టమాధిపతిగా పంచమములో శుక్ర కక్ష్య నందు సంచరించుట వలన...సమాచార రంగమునందు విప్లవాత్మక మార్పులు వచ్చును. విద్యావ్యవస్థలందు ప్రక్షాళనలు జరుగును. చలనచిత్ర పరిశ్రమకు మేలు జరుగును. రాజకీయ ఉద్దండులకు,ప్రముఖ నటీ-నటులకు ప్రమాదములు ఉన్నవి. రవికి మారక స్థానము నందు బుధుడు ఉండుట వలన ముఖ్యమంత్రి గారు జాగ్రత్తగా ఉండవలెను. ప్రాజెక్టుపనులందు ప్రభుత్వమునకు చిత్తశుద్ధి ఉన్ననూ, పనులందు ఆటంకములు వచ్చును. వాతావరణ మూలక ప్రమాదములు ఉన్నవి. రవాణా శాఖ నందు సంస్కరణలుండును.

వర్తమానమున టి.ఆర్.ఎస్ ప్రభుత్వమునకు పంచవర్ష దశా విభాగములో ఈ సంవత్సరము అక్టోబర్ వరకు రాహు దశ నడుచును. తదుపరి గురుదశ నడుచును. రాహువు అయిదింట కుజ కక్ష్యనందు సంచరించు వలన...కొత్త ప్రభుత్వమునకు అంతగా మంచికాలం కాదు. శనికి 8దింట, గురునికి బాధకస్థానమందు రాహువు ఉండుట వలన 5-04-2019 నుండి 14-04-2019 మధ్య కాలములో గాని లేదా 1-08-2019 నుండి 10-08-2019 మధ్యకాలము గాని ప్రభుత్వమునకు లేదా ముఖ్యమంత్రి గారికి గండకాలం. తదుపరి వచ్చు గురు దశ మంచిఫలితములను ఇచ్చును.

తెలంగాణా జన్మలగ్నమునకు, వర్షకుండలి లగ్నము 6వది అగుటయు, జన్మలగ్న కక్ష్యాధిపతి అయిన బుధుడు వర్షకుండలి నందు తృతీయ-వ్యయా

ధిపతిగా 8దింట రాహుకక్ష్యలోను, గురునాడిలోను సంచరించుట వలన... ప్రభుత్వ అధినాయకునికి ప్రమాదము ఉంది. రాష్ట్ర సాధారణ పరిస్థితులు ఆశాజనకముగా ఉండవు. ప్రకృతి విపత్తులు, ప్రజలకు అంటువ్యాధులు ప్రబలును. క్లిష్టకాలములో వైద్యులు నిర్లక్ష్యముగా ఉందురు.

ధన-లాభాధిపతి అయిన గురుడు స్వకక్ష్యలో ఉన్నాడు. అట్టి గురుడు వర్షలగ్న కుండలి నందు, షష్ఠ-భాగ్యాధిపతిగా 5దింట స్వకక్ష్యలోను-కేతు నాడిలోను సంచరించుట వలన... ప్రభుత్వ ఆదాయము బాగుండును. వినోద-వాణిజ్య పన్నులు పెరుగును.

తృతీయ-రాజ్యాధిపతి అయిన కుజుడు చంద్ర కక్ష్యలో ఉన్నాడు. అట్టి చంద్రుడు వర్షలగ్నకుండలి నందు, లగ్నాధిపతిగా స్వకక్ష్యలోను బుధనాడి లోను సంచరించుట వలన... 2019 ఏప్రిల్,ఆగస్ట్,నవంబర్ నెలలందు పాలకునికి గండము కలుగును. నూతన రైలు మార్గములకు-ప్రభుత్వ పనులకు అంతరాయములు కలుగును.

చతుర్థ-భాగ్యాధిపతి అయిన శుక్రుడు శని కక్ష్యలో ఉన్నాడు. అట్టి శని వర్షలగ్న కుండలి నందు, సప్తమ-అష్టమాధిపతిగా 6రింట కుజకక్ష్యలోను, గురునాడినందు సంచరించుట వలన... వాతావరణ దుర్యోగములు కలుగును. వేసవినందు తీవ్ర వడగాల్పులు ఉండును. రైతులకు నష్టములు వాటిల్లును. కొన్నితావుల మతఘర్షణలు చెలరేగును. జనసమూహమునందు ఉగ్రవాద చర్యలు భయభ్రాంతులను కలిగించును.

పంచమ-అష్టమాధిపతి అయిన బుధుడు, శుక్ర కక్ష్యలో ఉన్నాడు. అట్టి శుక్రుడు వర్షలగ్నకుండలి నందు, చతుర్థ-లాభాధిపతిగా 8దింట చంద్ర కక్ష్యలోను, గురునాడిలోను సంచరించుట వలన... విద్యార్థులకు ప్రమాదములు జరుగును. విద్యాలయాల్లో విస్మయకర సంఘటనలు జరుగును. కొన్ని పాఠశాలలకు-కళాశాలలకు గుర్తింపు రద్దు చేయుదురు. జల ప్రమాదములందు విద్యార్థులు మరణించెదరు. "సి,డి,యస్" అక్షరాల ప్రారంభముతో పేర్లు మొదలయ్యే నటీనటులకు గండములు కలుగును.

షష్ఠాధిపతి అయిన చంద్రుడు స్వకక్ష్యలో ఉన్నాడు. అట్టి చంద్రుడు వర్షకుండలి నందు, లగ్నాధిపతిగా 9దింట స్వకక్ష్యలోనే సంచరించుట వలన.. రక్షణ వ్యవస్థ మరింత పటిష్టమగును. రక్షణ వ్యవస్థలో స్త్రీలకు ప్రాధాన్యత





కలుగును. నిత్యావసర వస్తుధరలు గతముకంటే కొంత తగ్గును. పోలీసు ఉన్నతాధికారులకు ప్రమాదములు జరుగును. ఫోన్ ట్యాపింగ్ సంఘటనలుకలకలం సృష్టించును.

సప్తమాధిపతి అయిన సూర్యుడు గురు కక్ష్యలో ఉన్నాడు. అట్టి గురుడు వర్షలగ్నకుండలి నందు, షష్ఠ-భాగ్యాధిపతిగా 5దింట స్వకక్ష్యలో సంచరించుట వలన... విదేశీ పెట్టుబడుల వలన ఆదాయము పెరుగును. రాజకీయ నాయకులకు-కళాకారులకు గుర్తింపు కలుగును. సామూహిక వివాహములు జరుగును. "కళ్యాణలక్ష్మీ" పథకము మరింతగా ముందుకు సాగును. ప్రముఖుల వివాహ విషయాలు రచ్చకెక్కును.

**2019 ఏప్రిల్ :** ప్రతికూల వాతావరణము. అంటువ్యాధులు ప్రబలును. పోలీసు ప్రముఖులకు ప్రమాదము. స్వల్ప మతఘర్షణలు. దేవాలయాలు-చర్చ్‌లు-మసీదుల వద్ద జాగ్రత్తగా ఉండవలెను. వాణిజ్యపన్నులు పెరుగును. వైద్యులు సమ్మెలు చేయుదురు. రకరకాల పుకార్లు వ్యాపించును.

**మే :** రాష్ట్ర సాధారణ పరిస్థితులు ఆశాజనకముగా ఉండవు. ప్రజానష్టములు జరుగును. అధికారములో ఉన్నవారికి మంచికాలము కాదు. మతపరమైన సమస్యలు తలెత్తును. న్యాయవాదులకు-పోలీసు ప్రముఖులకు-పండితులకు ప్రతికూల కాలము. ప్రముఖుడొకరు మరణించును. సానుభూతి ఘటనలు.

**జూన్ :** ప్రముఖులకు అనారోగ్యము. ప్రభుత్వ ఆదాయము పెరుగును. వాతావరణములో ఆకస్మిక మార్పులు. రైతులకు మేలు కలుగును. అధికారులకు-ప్రభుత్వమునకు అనుకూల కాలము. ప్రముఖుల ఇంట శుభసంఘటనలు. పెనుగాలుల వలన సమాచార వ్యవస్థకు నష్టము కలుగును.

**జూలై :** శుభసంఘటనలు జరుగును. రక్షణ వ్యవస్థ బలపడును. అధికారులకు మేలు జరుగును. రాష్ట్రములో శాంతి-సుస్థిరతలు నెలకొనును. పాలకులు దూర ప్రయాణములు చేయుదురు. పాడి-పరిశ్రమ వృద్ధి యగును. కొన్నితావుల సర్ప భయములు కలుగును. భారీ వర్షములు కురియును.

**ఆగస్ట్ :** యజ్ఞ-యాగాది క్రతువులు విరివిగా జరుగును. మతపరమైన కార్యక్రమములు విరివిగా జరుగును. చాలాచోట్ల భారీవర్షములు కురియుట వలన హైదరాబాద్ నగరము ముంపునకు గురియగును. కమ్యూనికేషన్ వ్యవస్థ బలపడును. హైవే ప్రయాణములందు జాగ్రత్తగా ఉండవలెను.

తెలంగాణాకు తుఫాన్ మరియు అధిక ఉష్ణోగ్రతలచే ప్రమాదములు.



**సెప్టెంబర్ :** ప్రతికూల వాతావరణముచే నష్టములు సంభవించును. పశు-జన నష్టములు ఉండవచ్చు. అంటురోగములు ప్రబలును. నిలకడైన వాతావరణము ఉండదు. చలిగాలులు వీచును. రోడ్డు ప్రమాదములలో స్త్రీలు ఎక్కువగా మరణించెదరు. ప్రముఖ స్త్రీలు రచ్చకెక్కును.

**అక్టోబర్ :** రోడ్డు-రైలు-జల ప్రమాదములచే నష్టములు అధికముగా ఉండవచ్చు. సమాచార-ప్రసార మాధ్యమముల యందు అవకతవకలు బయలుపడును. ప్రముఖులు భూమి సంబంధిత వివాదములో ఇరుక్కొందురు. పోలీసులకు ప్రమాదములు జరుగును. మీడియాకు నష్టము.

**నవంబర్ :** వాతావరణములో ఆకస్మిక మార్పులు. తుఫాన్ వలన పంట నష్టములు జరుగును. కమ్యూనికేషన్స్‌కు అంతరాయములు కలుగును. పశు-పక్ష్యాదులు నష్టపడును. ప్రముఖులకు వాహన ప్రమాదములు జరుగును. కొన్నితావుల భూమి కంపించవచ్చు. విద్యార్థులకు ఇబ్బందులు.

**డిసెంబర్ :** చలిగాలుల తీవ్రత పెరుగును. భారీ వర్షములు కురియవచ్చు. అన్నివిధాలా అనుకూలమైన కాలము కాదు. ప్రజలకు రకరకాల సమస్యలు ఉత్పన్నమగును. బ్యాంకింగ్ లేదా చిట్‌ఫండ్ కుంభకోణములు బయలుపడును. విదేశీ దౌత్యములు ఫలించును. పిడుగులచే ప్రమాదము.

**2020 జనవరి :** పాలకునికి గండము కలుగును. అధికారులు జాగ్రత్తగా వ్యవహరించవలెను. రక్షణ వ్యవస్థ బలపడును. దొంగతనములు ఎక్కువగును. కొన్నితావుల అగ్నిప్రమాదములు జరుగును. చలనచిత్ర నటీనటులకు కష్టకాలము. విద్యాలయాలందు విస్మయకర సంఘటనలు జరుగును.

**ఫిబ్రవరి :** ప్రభుత్వ వ్యతిరేకత ఎక్కువగును. ప్రముఖులు సెక్స్‌స్కాండల్స్ లో ఇరుక్కొందురు. ప్రముఖుల కుటుంబ కలహములు రచ్చకెక్కును. దొంగలు లేదా ఉగ్రవాదులు మరణించును. ఆకస్మిక వాతావరణ నష్టములు. ఆర్థిక కుంభకోణములు బయలుపడును. ప్రముఖునికి నష్టము.

**మార్చ్ :** కొన్నితావుల ఆకస్మిక వర్షసూచనలు. ప్రముఖ స్త్రీ ఒకరు మరణించును. రాత్రుళ్ళు చలిగాలుల తీవ్రత ఉంటుంది. విభ్రాంతికర రహస్య సంఘటనలు వెలుగుచూచును. కొన్నితావుల ప్రాచీన వస్తువులు బయలుపడును. ప్రముఖ నటీమణి వివాదములలో ఇరుక్కొనును. ఫల నష్టములు.



ఈ సంవత్సరము కూడా పాకిస్తాన్‌తో యుద్ధవాతావరణము తప్పదు.



## శ్రీ వికారి లో భారతదేశ భవిష్యత్

| | | | |
|---|---|---|---|
| | | లగ్నము 08°<br>రాహు 05° | కుజ 07° |
| | **స్వతంత్ర భారత ఆవిర్భావ కుండలి**<br>**15-08-1947**<br>శుక్రవారము గం॥ 00.00<br>**న్యూఢిల్లీ** | | రవి 28°<br>చంద్ర 04°<br>బుధ 14°<br>శుక్ర 22°<br>శని 20° |
| | | | |
| | కేతు 05° | గురు 26° | |

| | | | |
|---|---|---|---|
| బుధ 03° | రవి 00° | కుజ 21° | రాహు 28° |
| శుక్ర 28° | **జగల్లగ్నకుండలి**<br>**14-04-2019**<br>**ఆదివారము**<br>**సాయంత్రము 4-54**<br>**న్యూఢిల్లీ** | | చంద్ర 22° |
| | | | |
| కేతు 28°<br>శని 26°<br>గురు(వ)00° | | | లగ్నము 06° |

వర్తమానమున భారతదేశమునకు చంద్ర మహాదశ నడుస్తున్నది. ఇందు 2020 ఫిబ్రవరి వరకు గురుభుక్తియు తదుపరి శనిభుక్తి నడుచును. గురుడు అష్టమ-లాభాధిపతిగా సప్తమ భావమునందు బుధకక్ష్యలో సంచరించుట వలన...దేశమునందు జననష్టములు అధికముగా ఉండును. దేశ వ్యతిరేక కార్యకలాపములు ఎక్కువగును. దేవాలయములు-మసీదులు-చర్చ్‌లందు భద్రత అవసరము. ప్రముఖ స్వామీజీలకు,మతాచార్యులకు,న్యాయమూర్తులకు ప్రమాదములు కలుగును. పొరుగు దేశములతో యుద్ధపరిస్థితులు తలెత్తును. దేశ రక్షణ సమాచారమును రహస్యముగా పొరుగు దేశములకు చేరవేసే దేశద్రోహులు యొక్క నిజస్వరూపములు బయలుపడును. విదేశీ దౌత్యములు ప్రతికూలమగును. ఆర్థిక సంస్కరణలు బెడిసికొట్టును. శాస్త్ర-సాంకేతిక రంగములందు విజయములు వరించును. అతిపురాతన విషయములు-వస్తువులు బయలుపడును. తూర్పు-పశ్చిమ-ఉత్తర-ఈశాన్య రాష్ట్రములందు భూకంపములు వచ్చును. జూలై-అక్టోబర్-నవంబర్-జనవరి-మార్చ్ నెలలందు ప్రకృతి విపత్తులచే ఆస్తి-ప్రాణనష్టములు జరుగును.

వర్తమానమున భచక్రదశలందు మకరదశలో కేతువు 5-05-2019 నుండి 5-05-2020 వరకు నడుచును. కేతువు లగ్నాత్తు 7డింట అనురాధ నక్షత్రమునందు సంచరించుట వలన...ఈ సంవత్సరము భారతదేశమునందు భూకంపము సంభవించుట తథ్యమని తెలియుచున్నది. మూల-ఉత్తరాషాఢ-ధనిష్ట-ఉత్తరాభాద్ర నక్షత్రములందు భూమి కంపించును. 2020 జనవరి 22-24-26-29 తేదిలందు జార్ఖండ్-గుజరాత్-బీహార్-

ఈ సంవత్సరము భారత్‌కు భూకంప ప్రమాదములు ఉన్నవి.



జమ్ముకాశ్మీర్-పశ్చిమబంగ్లా రాష్ట్రములందు గౌహతి-శ్రీనగర్-గ్యాంగ్‌టక్ మరియు గంగానదీ ప్రాంతములందు భూకంపములు సంభవమగును.

స్వతంత్ర్య భారతదేశ ఆవిర్భావ లగ్నమునకు, జగల్లగ్నము 5వదిగా ఉదయిస్తున్నది. ఆవిర్భావ లగ్న కక్ష్యాధిపతి అయిన చంద్రుడు జగల్లగ్నకుండలి నందు, 12డింట కేతుకక్ష్యలో సంచరించుటవలన...ఈ సంవత్సరము భూకంపములు లేదా ప్రకృతివిపత్తులు అధికముగా ఉంటాయి.

భారతదేశ లగ్న షష్ఠాధిపతి అయిన శుక్రుడు కేతుకక్ష్యలో ఉన్నాడు. అట్టి కేతువు జగల్లగ్నకుండలి నందు 5దింట రాహుకక్ష్యలో సంచరించుట వలన... దేశ సాధారణపరిస్థితులు అనుకూలముగా ఉన్ననూ, ప్రకృతి విపత్తులచే ప్రాణ-ఆస్తి నష్టములు జరుగును. నావికాదళము వృద్ధియగును. రక్షణ వ్యవస్థ బలపడును. నూతన వైద్యపరిశోధనలు ఫలవంతమగును.

ధన-పంచమాధిపతి అయిన బుధుడు శని కక్ష్యలో ఉన్నాడు. అట్టి శని జగల్లగ్నకుండలి నందు 5దింట కుజకక్ష్యలో సంచరించుట వలన... ఆర్థిక సంస్కరణలు ఫలవంతము కావు. సినిమాథియేటర్స్ నందు ప్రమాదములు జరుగును. జననాల రేటు తగ్గును. బ్యాంకింగ్ వ్యవస్థలో కుంభకోణములు.

తృతీయాధిపతి అయిన చంద్రుడు కుజకక్ష్యలో ఉన్నాడు. అట్టి కుజుడు జగల్లగ్నకుండలి నందు 9దింట రాహుకక్ష్యలో సంచరించుట వలన... నూతన రైలుమార్గముల అభివృద్ధి జరుగును. రైలు ప్రమాదములు ఎక్కువ. ప్రముఖ మీడియా అధినేత మరణించును. కమ్యూనికేషన్ వ్యవస్థలో ఆటు-పోటులుండును. తుఫాన్లు వలన సమాచార వ్యవస్థలు నష్టపడును.

చతుర్థాధిపతి అయిన సూర్యుడు స్వకక్ష్యలో ఉన్నాడు. అట్టి సూర్యుడు జగల్లగ్నకుండలి నందు 8దింట కుజకక్ష్యలో సంచరించుట వలన... ప్రతికూల వాతావరణముచే పంటలు నష్టపడును. భూమి కంపించుటచే కొన్నితావుల సునామీ హెచ్చరికలు జారీయగును. ప్రకృతి విపత్తులచే ప్రాణ-ఆస్తి నష్టములు అధికముగా ఉంటాయి. గనులందు, నదులందు, సముద్రము నందు ప్రమాదములు జరుగును. వంతెనలు-నిర్మాణములు కూలును.

సప్తమ-వ్యయాధిపతి అయిన కుజుడు శుక్ర కక్ష్యలో ఉన్నాడు. అట్టి శుక్రుడు జగల్లగ్నకుండలి నందు 7డింట గురుకక్ష్యలో సంచరించుట వలన... నిఘా వ్యవస్థ పటిష్టమగును. ప్రముఖుల ఇంట శుభకార్యములు జరుగును. అంతర్జాతీయ వ్యాపారములు-విదేశి దౌత్యములు అనుకూలమగును.

అష్టమ-లాభాధిపతి అయిన గురుడు బుధకక్ష్యలో ఉన్నాడు. అట్టి



ఈ సంవత్సరము రాజ్యాంగములో పలు సవరణలు జరుగును.



బుధుడు జగల్లగ్నకుండలి నందు 7డింట గురుకక్ష్యలో సంచరించుట వలన.. ప్రముఖులకు విమాన-రోడ్డు-జల ప్రమాదములు ఉన్నాయి. ప్రకృతి విపత్తులందు ప్రభుత్వము తక్షణ కర్తవ్యములను నిర్వర్తించును. సుప్రీమ్‌కోర్టు ప్రధాన న్యాయమూర్తికి ప్రమాదములున్నవి. జలప్రమాదములు-వరదలు.

భాగ్య-రాజ్యాధిపతి అయిన శని కేతుకక్ష్యలో ఉన్నాడు. అట్టి కేతువు జగల్లగ్నకుండలి నందు 5దింట రాహుకక్ష్యలో సంచరించుట వలన... ప్రస్తుత అధికారపార్టీ అయిన భారతీయ జనతా పార్టీకి ఈ సంవత్సరము జరుగు ఎన్నికలు అనుకూలముగా ఉన్ననూ, తిరిగి అధికారమును పొందుటకు ఇతరుల సహకారము అవసరము. రాజ్యాంగ సవరణలు జరిగే సూచనలు. అయోధ్యలో రామమందిర నిర్మాణపనులు ముందుకుసాగును. దేశము నందు ధార్మిక వ్యవస్థలు బలపడును. విమానయాన రంగమునందు సంస్కరణలు ఉండును. సుప్రీమ్‌కోర్టు తీర్పులు సంచలనాత్మకముగాను వివాదాస్పదముగాను ఉండును.

**2019 ఏప్రిల్ :** ప్రముఖ ధార్మికవ్యక్తి మరణించును. ప్రముఖదేవాలయ వివాదములు చక్కదిద్దే ప్రయత్నములు జరుగును. సముద్రమునందు ప్రమాదములు సంభవమగును. నావికాదళమును వృద్ధి చేయుదురు. ప్రముఖులు విమాన ప్రమాదములో ఇరుక్కొందురు. న్యాయవాదులకు ముప్పు.

**మే :** రాజకీయ నాయకులకు-ప్రముఖులకు ప్రమాదములు జరుగును. వాతావరణములో తీవ్ర ఉష్ణోగ్రతలచే అగ్నిప్రమాదములు సంభవించును. ప్రధానమంత్రికి గండము. విద్యావ్యవస్థనందు అవకతవకలు నెలకొనును. నేరస్థుల సంఖ్య పెరుగును. కొన్నితావుల విద్యార్థుల మధ్య గొడవలు.

**జూన్ :** నిఘావ్యవస్థలు బలహీనపడును. సరిహద్దు ప్రాంతములందు అప్రమత్తముగా ఉండవలెను. సైనికులకు ప్రమాదములు జరుగును. కొన్ని రాష్ట్రములందు వాతావరణ పరమైన విపత్తులు నెలకొనును. ప్రముఖ పార్లమెంటేరియన్‌కు గండము. ఉగ్రవాదచర్యల వలన జననష్టములు ఉంటాయి.

**జూలై :** చాలా రాష్ట్రములందు వరద ప్రమాదములు కలుగును. భారీ వర్షములచే పంటలు నష్టపడును. ఉగ్రవాదులు హతమగుదురు. వైద్యరంగమునందు కుంభకోణములు బయలుపడును. నదీతీరప్రాంత ప్రజలు జాగ్రత్తగా ఉండవలెను. కొన్నితావుల అంటువ్యాధులు ప్రబలు అవకాశములున్నవి

**ఆగస్ట్ :** పొరుగుదేశముల కవ్వింపు చర్యలను అణచివేయుదురు. ప్రజల ఆరోగ్యము ఎడల శ్రద్ధ పెడుదురు. ప్రముఖ వ్యక్తి మరణించును. గాలులతో

కూడిన వర్షములు లేదా తుఫానుల వలన ఆస్థి-ప్రాణ నష్టములుండును. ప్రకృతి విపత్తులందు ప్రభుత్వము తక్షణచర్యలను చేపట్టును.

**సెప్టెంబర్ :** నూతన ఆర్థికపరమైన సంస్కరణలు అమలులోకి వచ్చును. దేశ సాధారణ పరిస్థితులు క్షేమకరముగా ఉండును. ఆర్థిక కుంభకోణములు బయలుపడును. ప్రముఖుల కుటుంబ సమస్యలు రచ్చకెక్కును. జల-వ్యవసాయ సంబంధిత రంగములందు పురోభివృద్ధి కలుగును. రైతులకు మేలు.

**అక్టోబర్ :** తుఫాన్‌లు లేదా పెనుగాలుల వలన పంటలు నష్టపడును. వివిధ కమ్యూనికేషన్ వ్యవస్థలకు అంతరాయములు కలుగును. నూతన ప్రచార-ప్రసార మాధ్యమములు నెలకొల్పబడును. జైళ్ళనందు-ఆసుపత్రులనందు సంస్కరణలు చేయుదురు. రక్షణ-నిఘా వ్యవస్థలు బలపడును.

**నవంబర్ :** ప్రతికూల వాతావరణముచే నష్టములు వాటిల్లును. విమాన ప్రమాదములు జరుగును. తుఫాన్లు-భూకంపములు సంభవమగును. ఉగ్రవాదులు తప్పించుకొందురు. మెడికల్ కుంభకోణములు వెలుగుచూచును. దేశ సాధరణ పరిస్థితులు అంత ఆశాజనకముగా ఉండవు.

**డిసెంబర్ :** సినిమా థియేటర్లందు-కళా సాంస్కృతిక పీఠములందు ప్రమాదములు సంభవమగును. విద్యార్థులు జాగ్రత్తగా ఉండవలెను. కొన్నితావుల భూమి కంపించును. వాతావరణములో ఆకస్మికమార్పులుంటాయి. చలితీవ్రత బాగా పెరుగును. పొగమంచు వలన రోడ్డుప్రమాదములు.

**2020 జనవరి :** భూకంపము వలన ఆస్థి-ప్రాణ నష్టములు సంభవమగును. చలిగాలుల తీవ్రత పెరుగును. పశువులు నష్టపడును. సైనికాదళమునకు-నావికాదళమునకు ప్రమాదములు జరుగును. పొరుగు దేశముల కవ్వింపు చర్యలను సమర్థవంతముగా ఎదుర్కొందురు. పుకార్లు వ్యాపించును.

**ఫిబ్రవరి :** ప్రభుత్వ వ్యతిరేకులు అణచివేయబడుదురు. కొన్నితావుల భూమి కంపించును. చలనచిత్ర ప్రముఖులకు ప్రమాదములు. ప్రముఖ వ్యాపారవేత్త మరణించును. చలనచిత్రమొకటి వివాదాస్పదమగును. విదేశీ దౌత్యములు-వ్యాపారములు యోగించవు. షేర్‌మార్కెట్ నష్టపడును.

**మార్చ్ :** ప్రముఖ రాజకీయ నాయకుడు మరణించును. ఆర్థిక కుంభకోణములు బయలుపడును. ఆర్థిక నష్టములు ఎక్కువగా ఉండును. ప్రముఖుల ఇంట అపశ్రుతులు జరుగును. సముద్రతీర ప్రాంతీయులు జాగ్రత్తగా ఉండవలెను. కొన్నితావుల భూమి కంపించును. ఆకస్మిక వాతావరణమార్పు





## శ్రీ వికారి (2019-20) లో గ్రహముల రాశి ప్రవేశ సమయములు

### సూర్యుడు

సంవత్సరాది నుండి మీనము

| | | | |
|---|---|---|---|
| ఏప్రిల్ | 14 | మేషము | సా॥4-54 |
| మే | 15 | వృషభము | మ॥1-50 |
| జూన్ | 15 | మిథునము | రా॥8-29 |
| జూలై | 17 | కర్కాటకము | ఉ॥7-26 |
| ఆగస్ట్ | 17 | సింహము | మ॥3-54 |
| సెప్టెంబర్ | 17 | కన్య | మ॥3-51 |
| అక్టోబర్ | 17 | తుల | రా॥3-46 |
| నవంబర్ | 16 | వృశ్చికము | రా॥3-31 |
| డిసెంబర్ | 16 | ధనుస్సు | సా॥6-06 |
| జనవరి | 14 | మకరము | తె॥4-46 |
| ఫిబ్రవరి | 13 | కుంభము | సా॥6-07 |
| మార్చ్ | 14 | మీనము | మ॥2-35 |

### కుజుడు

సంవత్సరాది నుండి వృషభము

| | | | |
|---|---|---|---|
| మే | 07 | మిథునము | ఉ॥10-49 |
| జూన్ | 22 | కర్కాటకము | రా॥3-21 |
| ఆగస్ట్ | 09 | సింహము | ఉ॥8-45 |
| సెప్టెంబర్ | 25 | కన్య | ఉ॥10-28 |
| నవంబర్ | 10 | తుల | సా॥6-15 |
| డిసెంబర్ | 25 | వృశ్చికము | రా॥1-16 |
| ఫిబ్రవరి | 08 | ధనుస్సు | ఉ॥7-37 |
| మార్చ్ | 22 | మకరము | సా॥6-25 |

### బుధుడు

సంవత్సరాది నుండి కుంభము

| | | | |
|---|---|---|---|
| ఏప్రిల్ | 12 | మీనము | ఉ॥7-02 |
| మే | 03 | మేషము | సా॥6-28 |
| మే | 18 | వృషభము | రా॥12-40 |
| జూన్ | 01 | మిథునము | రా॥1-30 |
| జూన్ | 20 | కర్కాటకము | తె॥4-47 |
| జూలై | 07 | వక్రం మొదలు | తె॥4-39 |
| జూలై | 29 | మిథునము(వక్రం) | రా॥10-54 |
| ఆగస్ట్ | 01 | వక్రం ఆఖరు | ఉ॥9-22 |
| ఆగస్ట్ | 03 | కర్కాటకము(ఋజు) | సా॥6-18 |
| ఆగస్ట్ | 26 | సింహము | మ॥3-20 |
| సెప్టెంబర్ | 11 | కన్య | ఉ॥6-19 |
| సెప్టెంబర్ | 29 | తుల | మ॥2-35 |
| అక్టోబర్ | 23 | వృశ్చికము | రా॥2-34 |
| అక్టోబర్ | 31 | వక్రం మొదలు | రా॥9-04 |
| నవంబర్ | 07 | తుల (వక్రం) | మ॥1-09 |
| నవంబర్ | 20 | వక్రం ఆఖరు | రా॥12-35 |
| డిసెంబర్ | 05 | వృశ్చికము(ఋజు) | మ॥12-27 |
| డిసెంబర్ | 25 | ధనుస్సు | సా॥5-21 |
| జనవరి | 13 | మకరము | మ॥1-03 |
| జనవరి | 30 | కుంభము | తె॥4-21 |
| ఫిబ్రవరి | 16 | వక్రం మొదలు | తె॥6-17 |
| మార్చ్ | 10 | వక్రం ఆఖరు | ఉ॥9-12 |

### గురుడు

సంవత్సరాది నుండి ధనుస్సురాశిలో

| | | | |
|---|---|---|---|
| ఏప్రిల్ | 10 | వక్రం మొదలు | రా॥9-43 |
| ఏప్రిల్ | 19 | వృశ్చికము(వక్రం) | ఉ॥10-36 |
| ఆగస్ట్ | 11 | వక్రం ఆఖరు | సా॥6-37 |
| నవంబర్ | 05 | ధనుస్సు | సా॥6-25 |
| డిసెంబర్ | 12 | పశ్చాదస్తమయం | సా॥6-51 |
| జనవరి | 11 | ప్రాగుదయము | తె॥4-50 |

### శుక్రుడు

సంవత్సరాది నుండి కుంభము

| | | | |
|---|---|---|---|
| ఏప్రిల్ | 15 | మీనము | రా॥3-09 |
| మే | 10 | మేషము | రా॥9-09 |
| జూన్ | 04 | వృషభము | మ॥1-23 |
| జూన్ | 28 | మిథునము | రా॥3-35 |
| జూలై | 08 | ప్రాగస్తమయం | రా॥2-05 |
| జూలై | 23 | కర్కాటకము | మ॥2-49 |
| ఆగస్ట్ | 16 | సింహము | రా॥10-38 |
| సెప్టెంబర్ | 09 | కన్య | రా॥3-40 |
| సెప్టెంబర్ | 12 | పశ్చాదుదయము | తె॥5-30 |
| అక్టోబర్ | 04 | తుల | ఉ॥7-13 |
| అక్టోబర్ | 28 | వృశ్చికము | ఉ॥10-31 |
| నవంబర్ | 21 | ధనుస్సు | మ॥2-23 |
| డిసెంబర్ | 15 | మకరము | రా॥8-01 |
| జనవరి | 08 | కుంభము | తె॥6-28 |
| ఫిబ్రవరి | 02 | మీనము | తె॥4-28 |
| ఫిబ్రవరి | 28 | మేషము | రా॥3-53 |
| మార్చ్ | 28 | వృషభము | సా॥6-24 |

### శని

సంవత్సర ప్రారంభము నుండి ది.25-01-2020 వరకు ధనుస్సురాశిలో సంచరించును. తదాది సంవత్సరాంతము వరకు మకరరాశిలో సంచరించును. ది.29-04-2019 నుండి ది.18-09-2019 వరకు ధనుస్సురాశిలో వక్ర సంచారము చేయును.

### రాహు-కేతువులు

ఈ సంవత్సరమంతయూ రాహువు మిధున రాశిలోను, కేతువు ధనుసురాశిలోను సంచారము చేయును.

## 2019-20లో 27 నక్షత్రజులకు సంవత్సర ఫలము

**1.అశ్విని :** ఆర్థిక-శారీరక-మానసిక సమస్యలు. కుటుంబ కలహములు. ప్రమాదములు. వాస్తుమార్పులు. సరిహద్దు గొడవలు. కోర్టు సమస్యలు.

**2.భరణి :** సంతాన పరమైన ఆందోళనలు. దైవ సందర్శనములు. దీక్షలు. రాజకీయ వివాదములు. ప్రేమ వ్యవహారములు. నేత్ర-హృదయ రుగ్మతలు.

**3.కృత్తిక :** శుభకార్య సిద్ధి. వాహన లాభములు. బంధు-మిత్ర సహకారములు. పుణ్యక్షేత్ర సందర్శనములు. ఋణసౌకర్యములు. వ్యాపార వృద్ధి.

**4.రోహిణి :** ప్రమాదములు. చోరాగ్ని భయములు. నమ్మకద్రోహములు. విషజంతు భయములు. ఉదర-కిడ్నీ-గ్రంధి సంబంధిత సమస్యలు.

**5.మృగశిర :** ఆర్థికాభివృద్ధి. దూర ప్రయాణములు. శుభవార్తలు. విందు-వినోద కార్యకలాపములు. నూతన వస్తు-వస్త్ర-వాహన సౌఖ్యములు.

**6.ఆరుద్ర :** ఋణబాధలు. వ్యాపార నష్టములు. గుప్త రోగములు. కోర్టు వివాదములు. అకారణ విద్వేషములు. శరీరమందు గాయములు.

**7.పునర్వసు :** సోదర-సోదరీలతో పేచీలు. వ్యయప్రయాసలు. ఉద్యోగ పరమైన చిక్కులు. అపనిందలు-అవమానములు. విలువైన వస్తు మాయం.

**8.పుష్యమి :** విదేశీ ప్రయాణములు. నూతన వ్యాపార ప్రయత్నములు. శుభవార్తలు విందురు. చర్మ సంబంధిత రుగ్మతలు. గ్రంథ ప్రచురణలు.

**9.ఆశ్లేష :** దూరదేశములో ఇబ్బందులు. విషజంతు భయములు. చర్మ-ఉదర రుగ్మతలు. నేరారోపణలు. బంధనములు. ఆకస్మిక ప్రమాదములు.

**10.మఖ :** సంతాన లాభములు. దైవ సందర్శనములు. పెద్దల అనుగ్రహము. శుభకార్య సిద్ధి. దూర ప్రయాణములు. ధన-ధాన్య-వ్యాపారాభివృద్ధి.

**11పుబ్బ :** కుటుంబ కలహములు. వైవాహిక సమస్యలు. ఋణభయములు. అనారోగ్యములు. రాజకీయ వివాదములు. ఓటమి అవమానములు.

**12.ఉత్తర :** ఉద్యోగ ప్రాప్తి. వివాహాది శుభకార్యములు. వాహన లాభములు. ప్రియవ్యక్తుల సమాగము. ధన-ధాన్యవృద్ధి. శుభవార్తలు. సంతోషములు.

**13.హస్త :** విజయములు. మనోవాంఛా సిద్ధి. విద్య-ఉద్యోగ-వ్యాపారాభివృద్ధి. రాజకీయ పదవీ యోగములు. బంధు-మిత్రుల సహకారములు.





**14.చిత్త :** కుటుంబములో విషాదము. సానుభూతికర సంఘటనలు. నిరాశా-నిస్పృహలు. కోర్టు వివాదములు. నిరాభివృద్ధి. అవమానములు.

**15.స్వాతి :** ఉద్యోగ ఉన్నతి. ప్రశాంత జీవనము. స్త్రీసౌఖ్యము. దూరదేశ ప్రయాణము. రాజకీయ లాభములు. అభీష్టసిద్ధి. నూతన వస్తు లాభము.

**16.విశాఖ :** కుటుంబ కలహములు. ఇంటా-బయటా సమస్యలు. అనవసర ధనవ్యయములు. వైద్య సంప్రదింపులు. వివాహ ఆటంకములు.

**17.అనురాధ :** మోసపోవుట. ఆకస్మిక ప్రమాదములు. ఆత్మహత్యా ప్రయత్నములు. కోర్టు వివాదములు. మానసిక రుగ్మతలు. ధననష్టములు.

**18.జ్యేష్ఠ :** సంతాన సౌఖ్యములు. ఆర్థికాభివృద్ధి. దైవ సందర్శనములు. కుటుంబ సౌఖ్యము. శుభకార్యములు. బంధు-మిత్ర సమాగములు.

**19.మూల :** శారీరక-మానసిక-ఆర్థిక సమస్యలు. ప్రయాణాలలో ప్రమాదములు. అనవసర ధనవ్యయములు. వృత్తి-ఉద్యోగ-వ్యాపార నష్టములు.

**20.పూర్వాషాఢ :** అన్నింటా వ్యతిరేకత. వ్యసనానందములు. పరస్త్రీ వ్యామోహములు. ప్రమాదములు. కుటుంబ కలహములు. ధననష్టము.

**21.ఉత్తరాషాఢ :** శుభకార్య సిద్ధి. దూర ప్రయాణములు. నూతన వస్తు-వస్త్ర-వాహన సౌఖ్యములు. కళా-వ్యాపార రంగములందు పురోభివృద్ధి.

**22.శ్రవణము :** వాహన ప్రమాదములు. బంధు-మిత్రులతో కలహములు. పోలీసు-కోర్టు గొడవలు. పాడి-పంట-చెఱువులు నష్టములు.

**23.ధనిష్ఠ :** శుభాశుభ మిశ్రమ సంఘటనలు. భార్యాబిడ్డలతో సమస్యలు. అనవసర ధనవ్యయములు. ప్రయాణాలలో ఇబ్బందులు. ఋణసౌకర్యము.

**24.శతభిషము :** వృత్తి-ఉద్యోగ-వ్యాపారాభివృద్ధి. పండిత గోష్ఠులు. సన్మాన-సత్కారములు. బంధు-మిత్ర సందర్శనములు. అభీష్టసిద్ధి.

**25.పూర్వాభాద్ర :** వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులందు సమస్యలు. అధిక వ్యయప్రయాసలు. అశుభవార్తలు. నిరాశా-నిస్పృహ సంఘటనలు.

**26.ఉత్తరాభాద్ర :** అనారోగ్య సమస్యలు. మిత్ర-శతృత్వములు. ఋణసౌకర్యములు. నేత్ర-హృదయ సంబంధిత రుగ్మతలు. ధనవ్యయము.

**27.రేవతి :** సంతాన సౌఖ్యములు. రచనా వ్యాసాంగములు. సంతోష సౌఖ్యములు. దూర ప్రయాణములు. పుణ్యతీర్థ సంచారములు. ధనలాభము.

## 2019-20 లో రోజువారీ వర్షపాతము

ఈ సంవత్సరము మేఘాధిపత్యము **"శని"**కి పట్టుట వలన పంటలకు ప్రతికూలకాలము. పశ్చిమ-దక్షిణ దిశా ప్రాంతములకు తుఫాన్ ప్రమాదము లు పొంచి ఉన్నవి. ఈ సంవత్సరము వర్షాకాలములో... **గురు** గ్రహము వాయు నాడి నందు, **శని** గ్రహము సౌమ్య నాడి నందు, **రాహు-కేతువులు** జల-సౌమ్య నాడులందు సంచరించుట వలన... దేశము మొత్తము మీద తక్కువ వర్షపాతము ఉండి పెనుగాలులతో లేదా తుఫాన్లతో కూడిన వర్షములు కురియును. ద్వాదశనాగులలో **"వజ్రదంష్ట్ర"** నామక సర్పము ఉదయించుట వలన... వర్షలేమిచే పంటలు పాడగును. **"పుష్కర"** అను పేరుగల మేఘము **"మేరు"** పర్వతమునకు **ఈశాన్య** దిక్భాగమందు ఉద యించుట వలన... మందవృష్టి-పెనుగాలులచే పంటలు నాశనమగును. ఆంధ్రప్రదేశ్, ఛత్తీస్‌ఘడ్, బీహార్, కేరళ, కర్నాటక, పంజాబ్, హర్యానా రాష్ట్రములకు ప్రకృతివిపత్తులు ఉంటాయి. సూర్యుని **ఆరుద్రా** ప్రవేశకాల తిథి,వార,నక్షత్ర,లగ్న,గ్రహ ఫలితములను సమీక్షించి చూడగా... ఈ సంవ త్సరము అనుకూల వర్షములు కంటే ప్రతికూల వర్షములు ఉండును.

ఈ సంవత్సరము ఆంధ్రప్రదేశ్ నందు కడప, చిత్తూరు, కర్నూలు, పశ్చిమగోదావరి, నెల్లూరు జిల్లాలకు, తెలంగాణా నందు ఖమ్మం, నల్గొండ, కరీంనగర్, నాగర్‌కర్నూలు, పెద్దపల్లె, నిజామాబాద్, నిర్మల్, కుమురంభీమ్, కామారెడ్డి, యాదాద్రిభువనగిరి, భద్రాద్రికొత్తగూడెం జిల్లాలకు వాతావరణ పరమైన అరిష్టములు కలుగును.

**2019 ఏప్రిల్ :** **6.**పాడిగా **7.**పాడిగా **8.**పాడిగా **9.**పాడిగా **10.**గాలి-జల్లులు **11.**మబ్బులు **12.**జల్లులు **13.**జల్లులు **14.**వర్షము **15.**వర్షము **16.**మబ్బులు **17.**గాలి-మబ్బులు **18.**ఉష్ణతాపము **19.**ఉష్ణతాపము **20.**పాడిగాలులు **21.**గాలులు **22.**గాలులు **23.**గాలులు **24.**ఉష్ణము **25.**మబ్బులు **26.**జల్లులు **27.**వర్షము **28.**వర్షము **29.**వర్షము **30.**జల్లులు.

**మే :** **1.**పాడిగా **2.**పాడిగా **3.**ఉక్కపోత **4.**అల్పపీడనము **5.**గాలులు **6.**గాలులు **7.**మబ్బులు **8.**జల్లులు **9.**జల్లులు **10.**వర్షము **11.**వర్షము **12.**వర్షము **13.**మబ్బులు **14.**ఉష్ణము **15.**ఉష్ణము **16.**ఉష్ణము **17.**పెనుగాలులు **18.**పెనుగాలులు **19.**పెనుగాలులు **20.**పాడిగా **21.**ఉష్ణతాపము **22.**మబ్బులు **23.**జల్లులు **24.**వర్షము **25.**వర్షము **26.**వర్షము **27.**జల్లులు





**28.**పాడిగా **29.**పాడిగా **30.**ఉక్కపోత **31.**ఉక్కపోత.

**జూన్ :** **1.**ఉష్ణగాలి **2.**ఉష్ణగాలి **3.**ఉష్ణగాలి **4.**ఉష్ణము **5.**మబ్బులు **6.**జల్లులు **7.**వర్షము **8.**వర్షము **9.**వర్షము **10.**పాడిగా **11.**పాడిగా **12.**పాడిగా **13.**ఉక్కపోత **14.**గాలి **15.**పెనుగాలులు **16.**పెనుగాలులు **17.**ఉక్కపోత **18.**ఉక్కపోత **19.**మబ్బులు **20.**వర్షము **21.**వర్షము **22.**వర్షము **23.**వర్షము **24.**పాడిగా **25.**జల్లులు **26.**మబ్బులు **27.**గాలి **28.**గాలి **29.**అల్పపీడనము **30.**గాలి

**జూలై :** **1.**మబ్బులు **2.**జల్లులు **3.**వర్షము **4.**వర్షము **5.**వర్షము **6.**వర్షము **7.**జల్లులు **8.**పాడిగా **9.**జల్లులు **10.**మబ్బులు **11.**గాలి **12.**గాలి **13.** తుఫాన్ **14.**పెనుగాలులు **15.**ఉక్కపోత **16.**మబ్బులు-జల్లులు **17.**వర్షము **18.**వర్షము **19.**వర్షము **20.**వర్షము **21.**పాడిగా **22.**వరద **23.**వరద **24.**జల్లులు **25.**గాలి **26.**గాలి **27.**తుఫాన్ **28.**పెనుగాలులు **29.**మబ్బులు **30.**జల్లులు **31.**వర్షము.

**ఆగస్ట్ :** **1.**వర్షము **2.**వర్షము **3.**వర్షము **4.**మబ్బులు **5.**పాడిగా **6.**పాడిగా **7.**గాలి **8.**గాలి **9.**గాలి **10.**పాడిగా **11.**పాడిగా **12.**మబ్బులు **13.**జల్లులు **14.**వర్షము **15.**వర్షము **16.**వర్షము **17.**వర్షము **18.**పాడిగా **19.**జల్లులు **20.**పాడిగా **21.**గాలి **22.**గాలి **23.**పాడిగా **24.**పాడిగా **25.**జల్లులు **26.**వర్షము **27.**వర్షము **28.**వర్షము **29.**వర్షము **30.**వర్షము **31.**పాడిగా.

**సెప్టెంబర్ :** **1.**మబ్బులు **2.**జల్లులు **3.**పాడిగా **4.**తుఫాన్ **5.** పెనుగాలులు **6.**గాలులు **7.**పాడిగా **8.**మబ్బులు **9.**వర్షము **10.**వర్షము **11.**వర్షము **12.**వర్షము **13.**వర్షము **14.**గాలి **15.**గాలి **16.**పాడిగా **17.**గాలి **18.**తుఫాన్ **19.**గాలులు **20.**గాలులు **21.**శీతలం **22.**మబ్బులు **23.**వర్షము **24.**వర్షము **25.**వర్షము **26.**వర్షము **27.**పాడిగా **28.**మబ్బులు **29.**శీతలం **30.**పాడిగా.

**అక్టోబర్ :** **1.**గాలి **2.**తుఫాన్ **3.**పెనుగాలులు **4.**గాలి **5.**శీతలం **6.**మబ్బులు **7.**జల్లులు **8.**వర్షము **9.**వర్షము **10.**వర్షము **11.**శీతలం **12.** జల్లులు **13.**జల్లులు **14.**పాడిగా **15.**పాడిగా **16.**శీతగాలి **17.**శీతగాలి **18.**శీతగాలి **19.**మబ్బులు **20.**వర్షము **21.**వర్షము **22.**వర్షము **23.** వర్షము **24.**పాడిగా **25.**పాడిగా **26.**శీతగాలి **27.**పాడిగా **28.**శీతగాలి **29.**శీతగాలి **30.**తుఫాన్ **31.**పెనుగాలి.

**నవంబర్ :** **1.**పొడిగా **2.**మబ్బులు **3.**జల్లులు **4.**వర్షము **5.**వర్షము **6.**వర్షము **7.**వర్షము **8.**తుషారం **9.**తుషారం **10.**పొడిగా **11.**శీతగాలి **12.**శీతగాలి **13.**తుఫాన్ **14.**గాలి **15.**జల్లులు **16.**వర్షము **17.**వర్షము **18.**వర్షము **19.**వర్షము **20.**పొడిగా**21.**పొడిగా **22.**శీతగాలి **23.**శీతగాలి **24.**శీతగాలి **25.**శీతగాలి **26.**శీతగాలి **27.**పెనుగాలి **28.**పెనుగాలి **29.**మంచు **30.**మంచు.

**డిసెంబర్ :** **1.**మంచు **2.**మంచు **3.**మంచు **4.**మంచు **5.**తుషారం **6.**తుషారం **7.**పొడిగా **8.**చలిగాలి **9.**చలిగాలి **10.**చలిగాలి **11.**చలిగాలి **12.**మబ్బులు **13.**జల్లులు **14.**వర్షము **15.**వర్షము **16.**వర్షము **17.**వర్షము **18.**తేమగా **19.**తేమగా **20.**ఎండ **21.**ఎండ **22.**చలిగాలి **23.**చలిగాలి **24.**చలిగాలి **25.**అల్పపీడనము **26.**మబ్బులు **27.**జల్లులు **28.**వర్షము **29.**వర్షము **30.**వర్షము **31.**వర్షము.

**2020 జనవరి :** **1.**శీతలం **2.**తేమగా **3.**తేమగా **4.**మంచు **5.**శీతగాలి **6.**శీతగాలి **7.**శీతగాలి **8.**శీతగాలి **9.**మబ్బులు **10.**జల్లులు **11.**జల్లులు **12.**శీతలం **13.**శీతలం **14.**ఎండ **15.**ఎండ **16.**ఎండ **17.**మబ్బులు **18.**శీతగాలి **19.**శీతగాలి **20.**శీతగాలి **21.**శీతగాలి **22.**ఎండ **23.**మబ్బులు **24.**తుషారం **25.**తుషారం **26.**తుషారం **27.**తుషారం **28.**తేమగా **29.**తేమగా **30.**తేమగా **31.**ఎండ.

**ఫిబ్రవరి :** **1.**శీతగాలి **2.**శీతగాలి **3.**శీతగాలి **4.**శీతగాలి **5.**మబ్బులు **6.**జల్లులు **7.**జల్లులు **8.**శీతలం **9.**తుషారం **10.**తుషారం **11.**పొడిగా **12.**పొడిగా **13.**పొడిగా **14.**ఎండ **15.**అల్పపీడనము **16.**పెనుగాలి **17.**పెనుగాలి **18.**పొడిగా **19.**తేమగా **20.**తేమగా **21.**పొగమంచు **22.**పొగమంచు **23.**పొగమంచు **24.**పొగమంచు **25.**ఎండ **26.**ఎండ **27.**ఎండ **28.**ఎండ **29.**గాలి.

**మార్చ్ :** **1.**గాలి **2.**గాలి **3.**మబ్బులు **4.**జల్లులు **5.**వర్షము **6.**వర్షము **7.**వర్షము **8.**జల్లులు **9.**పొడిగా **10.**పొడిగా **11.**ఎండ **12.**ఎండ **13.**ఎండ **14.**అల్పపీడనము **15.**గాలి **16.**గాలి **17.**ఎండ **18.**మబ్బులు **19.**జల్లులు **20.**వర్షము **21.**వర్షము **22.**జల్లులు **23.**తేమగా **24.**తేమగా **25.**ఎండ.





## సరుకుల ధరలు 2019-2020

**2019 ఏప్రిల్ :** ఈ నెల **1-2-3-7-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు గత నెల కంటే పెరుగుదలగా సాగును. **4-5-6-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు తగ్గును. ముఖ్యముగా నిత్యావసర వస్తువులు, కూరగాయలు, బియ్యము, గోధుమలు, శనగలు, చిరుధాన్యాలు పెరుగును.

**మే :** ఈ నెల అన్ని వస్తువులకు మంచి గిరాకీ ఏర్పడును. ముఖ్యముగా మసాలా దినుసులు, సుగంధ ద్రవ్యములు, చెఱుకు, పేపరు, ప్రింటింగ్ సామాగ్రి, పెసలు, చిరుతిళ్ళు, రాగివస్తువులు, కంప్యూటర్లు, స్మార్ట్‌ఫోన్లు, పుస్తకములు, పప్పులు, రంగులు సాఫ్ట్‌వేర్లు, లెదర్ వస్తువులు పెరుగును.

**జూన్ :** ఈ నెల **4-5-6-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు గత నెల కంటే పెరుగుదలగా సాగును. **1-2-3** కూటములకు చెందిన వస్తువుల ధరలు తగ్గును. **7-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు నిలకడగా ఉండును. ముఖ్యముగా ఇనుము, సిమెంట్, నూనెలు బాగుగా పెరుగును.

**జూలై :** నిత్యావసర వస్తుధరలు ఆకాశాన్నంటును. గృహోపకరణ సామాగ్రి ఎలక్ట్రికల్-ఎలక్ట్రానిక్ వస్తువులు, కందులు, వివిధ యంత్రములు, రాగివస్తువులు, గోధుమలు, బియ్యము, వెండి, అపరాలు, పెరుగును. **1-3-7** కూట వస్తువులు నిలకడగా ఉండును. సిమెంట్-ఇనుము స్వల్పముగా తగ్గును.

**ఆగస్ట్ :** ఈ నెల **1-5-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు పెరుగను. ముఖ్యముగా బంగారము, ఇనుము, సిమెంట్, నూనెలు, నువ్వులు, బాదం పప్పు, జీడిపప్పు ధరలు పెరుగును. **2-4-6** కూటములకు చెందిన వస్తుధరలు గతంకంటే తగ్గును. ముఖ్యముగా కాస్మోటిక్స్-రడీమేడ్‌లు తగ్గును.

**సెప్టెంబర్ :** ఈ నెల **1-2** కూటములకు చెందిన వస్తువుల ధరలు గత నెల కంటే బాగుగా పెరుగును. ఇనుము-సిమెంట్-మట్టి-తిలతైలాదులు-హార్డ్‌వేర్-పప్పుధాన్యములు-సాఫ్ట్‌వేర్-అపరాలు తగ్గుముఖం పట్టును. ముఖ్యముగా వెండి-బంగారం-గోధుమలు-చిరుధాన్యములు-బియ్యం పెరుగును.

**అక్టోబర్ :** ఈ నెల **3-5-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు గత నెల కంటే పెరుగుదలగా సాగి, మాసాంతమున స్వల్పముగా తగ్గును. **2-6** కూటములకు చెందిన వస్తువుల ధరలు మందగించును. **1-4-7-8** కూటవస్తువులు నిలకడగా సాగును. వెండి తగ్గును. బంగారము పెరుగును.

కర్కాటకరాశి వారికి ఈ సంవత్సరము అనుకూలఫలితములు.





# 4. కర్కాటక రాశి ♋

పునర్వసు-4వపాదము, పుష్యమి-4పాదములు, ఆశ్లేష-4పాదములందు పుట్టినవారు మరియు "హీ, హూ, హే, హో, డా, డీ, డు, డే, డో"అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "కర్కాటకరాశి"కి చెందినవారు.

**రాబడి - 5** | **పోబడి - 5** | **కీర్తి - 5** | **అపకీర్తి - 2**

ఈ సంవత్సరము వీరికి ఆదాయ-వ్యయములు సమానముగా ఉండి, సమాజములో నూటికి **71**మంది అనుకూలముగాను, **29**మంది ప్రతికూలముగాను ఉందురు. నూతన ప్రయత్నములు ఫలించును. శుభసంఘటనలు జరుగును. భూమి-గృహనిర్మాణాది పనులు ముందుకుసాగును. నూతన వస్తు-వస్త్ర-వాహన సౌఖ్యములు ఉండును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు సంతృప్తికరముగా సాగును. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు ఫలించును. కోర్టువ్యవహారములందు విజయములు కలుగును. దూరప్రయాణములు చేయుదురు. అవివాహితులకు-నిస్సంతులకు-నిరుద్యోగులకు మంచికాలం. కళాకారులకు-పండితులకు-ప్రచురణకర్తలకు-ఉపాధ్యాయులకు యోగించును. రాజకీయముగా ఉన్నతి కలుగును. సన్మాన-సత్కారములను పొందెదరు. సంవత్సరాంతము నందు పనులందు జాప్యములుండును. తీర్థయాత్రాది పుణ్యక్షేత్ర సందర్శనములు చేయుదురు. స్వల్ప అనారోగ్య సమస్యలు.

ఈ రాశి **స్త్రీలకు** వస్తు-వస్త్ర-భూషణ సౌఖ్యములు కలుగును. అవివాహితులకు అనుకూల కాలము. కళారంగము నందు ఉన్నవారికి మంచికాలం.

**విద్యార్థులకు** ఉత్తమ ఫలితములు కలుగును. ఉపకార వేతనములు లభించును. దూర దేశ ప్రయాణములు. పరిశోధనాత్మక విద్యా లాభములు.

**ఉద్యోగులకు** ఉత్తమ కాలము. అనుకున్న ప్రదేశములకు బదిలీలు జరుగును. ఉద్యోగములో ఉన్నతి కలుగును. అధికారుల అనుగ్రహము.

**వ్యాపారులకు** యోగించును. వస్త్ర వ్యాపారులకు, లిక్కర్ వ్యాపారులకు, ఆక్వా వ్యాపారులకు, ఎఱువులు-పురుగుమందులు విక్రయించువారికి, నిర్మాణరంగము వారికి, కాంట్రాక్టర్లకు, చిత్ర నిర్మాతలకు, ఫైనాన్స్ వ్యాపారులకు, ఫిల్మ్ డిస్ట్రిబ్యూటర్లకు, హొటల్ వ్యాపారులకు అనుకూలించును.

**పునర్వసూ నక్షత్రజాలకు** శారీరక-మానసిక-ఆర్థిక సౌఖ్యములు. **పుష్యమీ నక్షత్రజాలకు** వ్యాపారాభివృద్ధి, అభీష్టవిజయములు. **ఆశ్లేషా నక్షత్రజాలకు** ఉదర రుగ్మతలు, చోర భయములు, సానుభూతికర సంఘటనలు.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 2.** ఈసంవత్సరము **పునర్వసుకు-2, పుష్యమికి-5, ఆశ్లేషకు-4** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **దుర్గాదేవిని** నిత్యము పూజించుట వలన నరఘోషలు నశించి, మానసిక ప్రశాంతతలు చేకూరును.



ఏప్రిల్-మే-జూన్-సెప్టెంబర్-అక్టోబర్ నెలలు అదృష్టప్రదము.



**2019 ఏప్రిల్ :** శారీరక-ఆర్థిక-మానసిక ప్రశాంతత. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు ఫలించును. వృత్తి-ఉద్యోగ-వ్యాపార నిర్వహణలు యోగించును
**అనుకూల తేదీలు : 1,2,3,5,6,8,9,10,12,13,15,16,19,20,21,23,25,26,27,28,30.**

**మే :** విద్యార్థులకు-నిరుద్యోగులకు-అవివాహితులకు అనుకూల కాలము. ధన-ధాన్య-వస్తు లాభములు. వ్యాపారాభివృద్ధి. బంధు-మిత్ర సందర్శనము.
**అనుకూల తేదీలు : 2,3,4,5,6,7,8,9,10,11,12,15,16,18,19,22,23,25,26,27,30.**

**జూన్ :** కళాకారులకు-రచయితలకు మేలు జరుగును. శుభకార్య ప్రయత్నములు ఫలించును. పాడి-పంట-చెఱువులు-వృత్తి-ఉద్యోగాదులలో మేలు.
**అనుకూల తేదీలు : 1,2,3,6,7,8,9,13,14,15,20,21,22,27,28,29.**

**జూలై :** ఉత్సాహ-ఉత్తేజములతో పనులు చేయుదురు. దైవ సందర్శనములు ప్రియవ్యక్తులతో ముచ్చట్లు ఉండును. దూర ప్రయాణములు ఉండును.
**అనుకూల తేదీలు : 1,4,6,8,11,13,15,18,20,25,26,27,29.**

**ఆగస్ట్ :** నూతన వస్తు-వస్త్ర-వాహన సౌఖ్యములు. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు ఫలించును. బంధు-మిత్ర సందర్శనములు. అభీష్టవిజయము.
**అనుకూల తేదీలు : 1,2,3,5,8,9,10,12,15,16,17,22,23,24,28,29,30,31.**

**సెప్టెంబర్ :** పనులు త్వరితగతిన సాగును. ధనలాభములు కలుగును. కృషికి తగిన ప్రతిఫలము వచ్చును. రాజకీయముగా ఉన్నతి కలుగును.
**అనుకూల తేదీలు : 2,4,5,6,7,9,12,13,14,19,20,21,22,26,27,28,29,30.**

**అక్టోబర్ :** శత్రు-మిత్రత్వములు. కోర్టు వ్యవహారములందు విజయము. మనోవాంఛా ఫలసిద్ధి. ప్రియవ్యక్తుల సమాగము. ఉద్యోగ లాభములు.
**అనుకూల తేదీలు : 1,2,3,4,5,6,7,8,9,10,11,12,13,15,16,17,18,19,22,23,24,25,26,29,31.**

**నవంబర్ :** శుభాశుభ మిశ్రమ ఫలితములు. అందుబాటుకు ధనము సర్దుబాటగును. పాతబాకీలు వచ్చును. పనులందు ఒకింత జాప్యము.
**అనుకూల తేదీలు : 1,2,4,5,8,9,11,13,15,16,18,20,23,27,30.**

**డిసెంబర్ :** నూతన వస్తు-వస్త్ర-భూషణ సౌఖ్యములు. దూర ప్రయాణములు. ప్రియవ్యక్తుల ఆగమనము. స్త్రీ సౌఖ్యములు. విందు-వినోదములు.
**అనుకూల తేదీలు : 2,4,7,9,14,16,21,22,25,28,29,30.**

**2020 జనవరి :** పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు ఫలించును. నూతన వాహన-వస్తు సౌఖ్యములు. స్త్రీల సహకారములు. నూతన మైత్రీ లాభములు.
**అనుకూల తేదీలు : 1,4,5,6,8,10,11,12,13,17,18,24,25,31.**

**ఫిబ్రవరి :** విద్యార్థులకు-స్త్రీలకు-వ్యాపారులకు-కళాకారులకు-రచయితలకు అనుకూల కాలము. స్వల్ప అనారోగ్య సమస్యలు. కార్యవిలంబనము.
**అనుకూల తేదీలు : 3,5,7,11,12,14,18,19,21,25,26,28.**

**మార్చ్ :** విద్యార్థులకు మేలు జరుగును. వ్యాపారాభివృద్ధి ఉంటుంది. అందుబాటుకు ధనము లాభించును. కళాకారులకు యోగించును.
**అనుకూల తేదీలు : 2,3,4,10,11,17,18,25,30.**



# 5. సింహ రాశి ♌

మఖ-4పాదములు,పుబ్బ-4పాదములు,ఉత్తర-1వపాదమందు పుట్టినవారు మరియు"మా,మీ,మూ,మే,మో,టా,టీ,టూ,టే"అను అక్షరములు తమపేరునకు ముందుగలవారు "సింహరాశి"కి చెందినవారు.

| రాబడి - 8 | పోబడి - 14 | కీర్తి - 1 | అపకీర్తి - 5 |
|---|---|---|---|

ఈ సంవత్సరము వీరికి నూటికి **36** రూపాయిలు ఆదాయము గాను, **64** రూపాయిలు వ్యయముగాను, సమాజములో నూటికి **17**మంది అనుకూలముగాను, **83**మంది ప్రతికూలముగాను ఉందురు. సంవత్సర ప్రథమార్థము నందు శారీరక-మానసిక-ఆర్థిక-రాజకీయ ఒత్తిళ్ళు అధికమగును. నూతన ప్రయత్నములు ఫలించవు. వృత్తి-ఉద్యోగ-వ్యాపారములు మందగించును. మధ్యవర్తిత్వములు చేయరాదు. అపరిచితులను సులువుగా నమ్మరాదు. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలందు భారీ పెట్టుబడులు పెట్టరాదు. భవిష్యత్తు గురించి ఎక్కువగా ఆలోచించెదరు. జీవితభాగస్వామి వలన బిడ్డల వలన ఇబ్బందులు పడుదురు. సంవత్సర ఉత్తరార్ధము నుండి క్రమేపి అనుకూల ఫలితములు ఉంటాయి. నిరుద్యోగులకు-అవివాహితులకు-నిస్సంతులకు మేలు జరుగును. శుభకార్య ప్రయత్నములు సిద్ధించును. వివాదములు సమసిపోవును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారములు యోగించును.

ఈ రాశి **స్త్రీలకు** శారీరకముగాను, మానసికముగాను మంచికాలము కాదు. సంవత్సరాంతమునుండి గృహిణులకు-అవివాహితులకు అనుకూలం

**విద్యార్థులకు** ప్రథమార్థము ఆశించిన ఫలితములు ఉండవు. ఉత్తరార్ధము నుండి మేలు జరుగును. రాజకీయములకు-వివాదములకు వెళ్ళరాదు.

**ఉద్యోగులకు** అధికారులతో ఇబ్బందులు ఉంటాయి. ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు యందు సమస్యలు ఏర్పడును. సంవత్సరాంతమునుండి మేలు.

**వ్యాపారులకు** ప్రతికూలకాలము. విద్యావ్యాపారులకు, వైద్యవ్యాపారులకు, మందులషాపుల వారికి, వడ్డీవ్యాపారులకు, ఫిల్మ్‌డిస్ట్రిబ్యూటర్స్‌కు, రియల్టర్లకు, పత్రికారంగమువారికి, మీడియా సంస్థలకు, కంప్యూటర్ వ్యాపారులకు, ఎలక్ట్రికల్-ఎలక్ట్రానిక్స్ వ్యాపారులకు అనుకూలకాలము.

**మఖా నక్షత్రజాలకు** శుభకార్య సిద్ధి, ధనలాభము, గౌరవాభివృద్ధి. **పుబ్బా నక్షత్రజాలకు** ఉద్యోగప్రాప్తి, కళారంగ ప్రవేశము, ఆరోగ్య సమస్యలు. **ఉత్తరా నక్షత్రజాలకు** రాజకీయలాభములు, వ్యసనానందములు.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 1.** ఈసంవత్సరము **మఖకు-3, పుబ్బకు-8, ఉత్తరకు-6** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **ఈశ్వరుణ్ణి** ఆరాధించుట వలన ఆరోగ్య-ఆర్థిక-మానసిక సమస్యలను దూరము చేసుకోగలరు.





**2019 ఏప్రిల్ :** శుభాశుభమిశ్రమ ఫలితములు. అందుబాటుకు ధనము సర్దుబాటగును. అవివాహితులకు-విద్యార్థులకు-నిరుద్యోగులకు మేలు.
**అనుకూల తేదీలు : 1,4,11,17,18,19,24,26,29.**

**మే :** పాతబాకీలు వసూలగును. ఆర్థికాభివృద్ధి ఉంటుంది. దూర ప్రయాణములు చేయుదురు. విద్యార్థులకు-వ్యాపారులకు-స్త్రీలకు యోగించును.
**అనుకూల తేదీలు : 1,3,6,10,13,14,17,19,21,22,24,26,27,28,29,31.**

**జూన్ :** అభీష్టసిద్ధి. నూతన వస్తు-వాహన యోగము. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు అనుకూలించును. ధైర్యోత్సాహములతో ముందుకు సాగుదురు.
**అనుకూల తేదీలు : 2,3,4,5,9,10,11,12,16,18,19,23,24,30.**

**జూలై :** వ్యయప్రయాసలతో పనులు సాగును. శారీరక-మానసిక ఒత్తిడులు ఉండును. పాడి-పంట-చెఱువులు నష్టపడును. గ్రహశాంతి అవసరము.
**అనుకూల తేదీలు : 1,5,7,12,14,19,29,31.**

**ఆగస్ట్ :** నూతన ప్రయత్నములు చేయరాదు. దూర ప్రయాణములు విరమించుకొనవలెను. ప్రమాదకర వస్తువులకు-ప్రదేశములకు దూరము.
**అనుకూల తేదీలు : 23,26,30.**

**సెప్టెంబర్ :** విద్యార్థులకు-వ్యాపారులకు-స్త్రీలకు ఒకింత అనుకూల కాలం. అందుబాటుకు ధనము సర్దుబాటగును. ఋణసౌకర్యములు చేకూరును.
**అనుకూల తేదీలు : 6,11,13,18,20,23,25,27.**

**అక్టోబర్ :** స్త్రీల సహకారములు కలుగును. పరస్త్రీ వ్యామోహములుండును. దూర ప్రయాణములు చేయుదురు. రావలసిన బాకీలు వసూలగును.
**అనుకూల తేదీలు : 4,7,11,18,20,21,25,27,28,30.**

**నవంబర్ :** శుభకార్య ప్రయత్నములు ఫలించును. అవివాహితులకు-నిరుద్యోగులకు-నిస్సంతులకు మేలు కలుగును. వస్తు-వస్త్ర-భూషణ లాభములు
**అనుకూల తేదీలు : 1,3,4,6,7,8,10,12,14,15,19,21,22,25,26,28,29.**

**డిసెంబర్ :** క్రయవిక్రయాదులు యోగించును. భూమి-గృహనిర్మాణాది పనులు ముందుకు సాగును. శత్రుమిత్రత్వములు ఉండును. ధనప్రాప్తి.
**అనుకూల తేదీలు : 2,3,5,6,10,11,12,13,17,18,19,23,24,26,30.**

**2020 జనవరి :** శుభాశుభ మిశ్రమ కాలము. అందుబాటుకు ధనము లభించును. నూతన వస్తు-వాహన యోగము. దూర ప్రయాణములు.
**అనుకూల తేదీలు : 1,2,8,9,16,19,23,26,27,30.**

**ఫిబ్రవరి :** నూతన ప్రయత్నములు ఫలించును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారములందు అభివృద్ధి కలుగును. గతకాలపు సమస్యలు పరిష్కారమగును.
**అనుకూల తేదీలు : 1,2,3,5,6,7,8,9,10,12,13,14,15,19,20,21,22,24,26,27,28,29.**

**మార్చ్ :** విద్యార్థులకు-స్త్రీలకు-వ్యాపారులకు-నిరుద్యోగులకు-అవివాహితులకు-నిస్సంతులకు-కళాకారులకు-శ్రామికులకు అనుకూల కాలము.
**అనుకూల తేదీలు : 2,5,6,7,9,12,13,14,19,20,21,24,26,27,28,30,31.**



## 6. కన్యా రాశి ♍

*ఉత్తర-2,3,4పాదములు,హస్త-4పాదములు,చిత్త-1,2,పాదము లందు పుట్టినవారు మరియు"టో,పా,పి,పూ,ష,ణ,ఠా,పే,పో"అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు"కన్యారాశి"కి చెందినవారు.*

| రాబడి - 11 | పోబడి - 5 | కీర్తి - 4 | అపకీర్తి - 5 |
|---|---|---|---|

ఈ సంవత్సరము వీరికి నూటికి **69** రూపాయిలు ఆదాయము గాను, **31** రూపాయిలు వ్యయముగాను, సమాజములో నూటికి **44**మంది అను కూలముగాను, **56**మంది ప్రతికూలముగాను ఉందురు. ఈ సంవత్సరము భారీ పెట్టుబడులు పెట్టరాదు. వృత్తి-ఉద్యోగ-వ్యాపారములందు అభివృద్ధి ఉండదు. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు నష్టమును కలిగించును. వాహన సారధ్యములో మెలకువగా ఉండవలెను. ధనవ్యవహారములలో మధ్య వర్తిత్వములు చేయరాదు. భూమి-గృహనిర్మాణాది పనులందు వ్యయప్రయా సలు ఏర్పడును. జీవితభాగస్వామితో కలహములు వచ్చును. దూరప్రయాణ ములు అనుకూలించవు. అవివాహితులకు-నిరుద్యోగులకు-నిస్సంతులకు మంచికాలము కాదు. సోదర-సోదరీలతోను, బంధువర్గముతోను విభేదము లు వచ్చును. ఆదాయమునకు మించిన ఖర్చులు ఉండును.నరములు-ఎముకలు-నడుము-ఉదరమునకు సంబంధించిన సమస్యలు ఏర్పడును.

ఈ రాశి **స్త్రీలకు** అన్నివిధములా ప్రతికూలకాలము. వివాదములకు దూరముగా ఉండవలెను. ఆరోగ్యము యెడల చాలా శ్రద్ధ వహించవలెను.

**విద్యార్థులకు** సామాన్యకాలము. విద్యనందు అవరోధములు ఏర్పడును. ప్రమాదకర ప్రదేశములకు-పనిముట్లకు దూరముగా ఉండవలెను.

**ఉద్యోగులకు** నిరాశాకాలము. ఉద్యోగ నిర్వహణనందు తీవ్రమైన ఒత్తి డులు ఉంటాయి. అధికారులతో సఖ్యత అవసరము. బదిలీలు ఉండును.

**వ్యాపారులకు** అనుకూల కాలము కాదు. పండ్లు-కూరగాయలు-పూల తోట్ల పెంపకముల వారికి, చిట్‌ఫండ్ వ్యాపారులకు, కమీషన్ ఏజంట్లకు, ధాన్యం వ్యాపారులకు, ట్రావెల్స్ వ్యాపారులకు, ఎఱువులు-పురుగుమందు వ్యాపారులకు, అపరాల వర్తకులకు, పచ్చళ్ళ వ్యాపారులకు యోగించును.

**ఉత్తరా నక్షత్రజాలకు** బంధు-మిత్ర సహకారములు, వ్యాపారాభివృద్ధి. **హస్తా నక్షత్రజాలకు** ఉద్యోగప్రాప్తి. నూతన వ్యాపార ప్రయత్నములు. **చిత్తా నక్షత్రజాలకు** శారీరక-మానసిక-ఆర్థిక-కుటుంబ సమస్యలు.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 5.** ఈ సంవత్సరము **ఉత్తరకు-5, హస్తకు-5, చిత్తకు-4** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **మహావిష్ణువును** నిత్యము పూజిం చుట వలన శారీరక-మానసిక-ఆర్థిక పరమైన సమస్యలు దూరమగును.





**2019 ఏప్రిల్ :** నూతన ప్రయత్నములు చేయరాదు. మధ్యవర్తిత్వములు చేయరాదు. ప్రమాదకర వ్యక్తులకు-ప్రదేశములకు-వస్తువులకు దూరము.
**అనుకూల తేదీలు : 3,10,15,22,29.**

**మే :** శుభాశుభ మిశ్రమ కాలము. స్త్రీలకు యోగించును. విద్యార్థులకు-వ్యాపారులకు-ఉద్యోగులకు ప్రతికూల కాలము. బాకీలు వసూలగును.
**అనుకూల తేదీలు : 8,15,17,20,24,27,31.**

**జూన్ :** విద్యార్థులకు-స్త్రీలకు-వ్యాపారులకు-కళాకారులకు ఒకింత యోగిం చును. దూర ప్రయాణములు చేయుదురు. అందుబాటుకు ధనప్రాప్తి.
**అనుకూల తేదీలు : 5,7,12,14,16,17,19,21,23,24,25,26,28,30.**

**జూలై :** నూతన వస్తు-వస్త్ర-భూషణ-వాహన యోగములు. శుభకార్య ప్రయ త్నములు ఫలించును. శుభవార్తలు విందురు. పాతబాకీలు వసూలగును.
**అనుకూల తేదీలు : 1,2,4,5,6,8,9,11,12,13,15,18,19,20,25,26,27,30.**

**ఆగస్ట్ :** ప్రియవ్యక్తుల సమాగము కలుగును. వ్యసనానందములుండును. వ్యాపారులకు యోగించును. అవివాహితులకు అనుకూల కాలము.
**అనుకూల తేదీలు : 2,4,5,6,7,9,11,14,16,19,21,26.**

**సెప్టెంబర్ :** పరస్త్రీల సహకారములు ఉండును. పనులయందు జాప్యములు కలుగును. ఇష్టము లేని ప్రదేశములకు బదిలీలు ఉంటాయి. గ్రహశాంతి.
**అనుకూల తేదీలు : 2,13,16,20,23,27,30.**

**అక్టోబర్ :** శుభాశుభ మిశ్రమ కాలము. వ్యాపారులకు-విద్యార్థులకు-స్త్రీలకు-కళాకారులకు యోగించును. అందుబాటుకు ధనము సర్దుబాటగును.
**అనుకూల తేదీలు : 2,4,9,11,14,16,18,21,23,25.**

**నవంబర్ :** పాడి-పంట-చెఱువులు సామాన్యముగా ఫలించును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు సాఫీగా సాగును. రచయితలకు అనుకూలము.
**అనుకూల తేదీలు : 1,8,13,15,17,18,20,22,24,27,29.**

**డిసెంబర్ :** నిరుద్యోగులకు సామాన్య కాలము. నూతన వ్యాపార ప్రయత్న ములు అంతగా ఫలించవు. వాహన సారధ్యములో మెలకువగా ఉండవలెను.
**అనుకూల తేదీలు : 1,4,6,8,13,15,16,20,25,27,31.**

**2020 జనవరి :** క్రయవిక్రయాదులందు మేలు కలుగును. స్థాన చలన ములుండును. ఋణసౌకర్యములు లాభించును. తగాదాలందు జయము.
**అనుకూల తేదీలు : 1,3,7,8,13,14,20,21,27,28.**

**ఫిబ్రవరి :** నూతన ప్రయత్నములు అంతగా ఫలించవు. ప్రమాదకర ప్రదేశములకు-వస్తువులకు-వ్యక్తులకు దూరముగా ఉండవలెను. గ్రహశాంతి.
**అనుకూల తేదీలు : 4,5,12,16,17,19,23,24,26.**

**మార్చ్ :** శుభాశుభ మిశ్రమ కాలము. విద్యార్థులకు-వ్యాపారులకు-స్త్రీలకు-కళాకారులకు రాణించును. వృత్తి-ఉద్యోగాదులందు ఒత్తిడులు తగ్గును.
**అనుకూల తేదీలు : 1,4,6,8,11,13,16,18,20,23,25,27.**



# 7. తులా రాశి ♎

*చిత్త-3,4పాదములు,స్వాతి-4పాదములు,విశాఖ-1,2,3,పాదములందు పుట్టినవారు మరియు"రా,రీ,రూ,రే,రో,తా,తీ,తూ,తే"అను అక్షరము లుతమ పేరునకు ముందుగలవారు"తులారాశి"కి చెందినవారు.*

**రాబడి – 8** | **పోబడి – 8** | **కీర్తి – 7** | **అపకీర్తి – 5**

ఈ సంవత్సరము వీరికి ఆదాయ-వ్యయములు సమానముగా ఉండి, సమాజములో నూటికి **58**మంది అనుకూలముగాను, **42**మంది ప్రతికూలముగాను ఉందురు. సంవత్సర ప్రథమార్ధము పనులు నిదానముగా పూర్తి చేయుదురు. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు లాభసాటిగా ఉండును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారములు క్రమేపి అభివృద్దిపథములో సాగును. తండ్రి లేదా తండ్రి వర్గీయుల ఆరోగ్యము యెడల జాగ్రత్త అవసరము. నిరుద్యోగులకు-అవివాహితులకు-నిస్సంతులకు అనుకూలించును. దూరప్రయాణములలో జాప్యములు కలుగును. రాజకీయముగా, సామాజికముగా మేలు జరుగును. ఆయాచిత పదవీలాభములు చేకూరును. రావలసిన పూర్వ బాకీలు వసూలు అగును. సంవత్సరాంతము నుండి వృత్తి-ఉద్యోగ-వ్యాపార నిర్వహణలందు ఒత్తిడులు ప్రారంభమగును. నూతన ప్రయత్నములు చేయరాదు. వాహన సారధ్యమునందు మెలకువగా ఉండవలెను.

ఈ రాశి **స్త్రీలకు** వస్తు-వస్త్ర-భూషణ సౌఖ్యములు కలుగును. సంవత్సర ద్వితీయార్ధము నుండి ఆరోగ్యము ఎడల శ్రద్ధ అవసరము. దైవ దర్శనములు

**విద్యార్థులకు** ఉత్తమ ఫలితములు కలుగును. ఉపకార వేతనములు లభించును. దూర దేశ ప్రయాణములు. పరిశోధనాత్మక విద్యా లాభములు.

**ఉద్యోగులకు** అనుకూలకాలము. ఋణ సదుపాయములు, అనుకున్న ప్రదేశములకు బదిలీలు-ఉద్యోగ ఉన్నతి-వేతనము పెరుగుదలలు ఉండును

**వ్యాపారులకు** యోగించును. చిత్రపరిశ్రమ వారికి, ఫైనాన్స్‌వ్యాపారులకు, ట్రావెల్స్ కంపెనీలకు, ఆటోమొబైల్ రంగము వారికి, గోల్డ్-సిల్వర్ వ్యాపారులకు, సెల్‌ఫోన్లు విక్రయించువారికి, గృహోపకరణ వస్తు వ్యాపారులకు, ధాన్యం వ్యాపారులకు, వస్త్రవ్యాపారులకు, రియల్టర్లకు అనుకూలము.

**చిత్తా నక్షత్రజులకు** ఇంటాబయటా కలహములు, ప్రమాదములు.
**స్వాతీ నక్షత్రజులకు** దూర ప్రయాణములు, స్థాన చలనములు, ఉద్యోగప్రాప్తి
**విశాఖా నక్షత్రజులకు** ఆర్థిక సమస్యలు, కలహములు, అనారోగ్యము.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 6.** ఈసంవత్సరము **చిత్తకు-9, స్వాతికు-2, విశాఖకు-9** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **కాలభైరవ స్వామిని** ఆరాధించుట వలన అన్నివిధములా సుఖసౌఖ్యభోగములు ప్రాప్తించును.





**2019 ఏప్రిల్ :** శ్రామికులకు-నిరుద్యోగులకు యోగించును. ఇరుగు-పొరుగువారి సహకారములు ఉండును. తరచూ దగ్గరి ప్రయాణములు.
**అనుకూల తేదీలు : 5,6,7,8,12,13,14,15,17,20,24,25,27.**

**మే :** విద్యార్థులకు-వ్యాపారులకు-ఉద్యోగులకు అనుకూల కాలము. అవివాహితులకు-నిరుద్యోగులకు-నిస్సంతులకు మేలు జరుగును. ధనప్రాప్తి.
**అనుకూల తేదీలు : 1,2,4,9,11,13,16,18,22,23,25,29,30.**

**జూన్ :** నూతన వస్తు-వస్త్ర-భూషణ-వాహన సౌఖ్యములు. అభీష్టవిజయములు. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు లాభించును. బాకీలు వచ్చును.
**అనుకూల తేదీలు : 1,6,7,8,10,13,14,15,20,21,22,26,27,28,29.**

**జూలై :** ధన-ధాన్య లాభములు. శుభ సంఘటనలు. ఉత్సాహ-ఉత్తేజములు. దూర ప్రయాణములు. పోటీ పరీక్షలందు విజయములు. వస్తుప్రాప్తి.
**అనుకూల తేదీలు : 3,4,5,6,10,11,12,13,15,17,18,19,20,21,22,24,25,27,28.**

**ఆగస్ట్ :** వృత్తి-ఉద్యోగ-వ్యాపార లాభములు. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు యోగించును. విందు-వినోద శుభకార్యములందు పాల్గొందురు.
**అనుకూల తేదీలు : 1,3,4,7,8,10,11,12,13,14,15,17,18,19,20,21,22,23,24,25,27,28,29,30,31.**

**సెప్టెంబర్ :** సన్మాన-సత్కారములు. అవివాహితులకు-నిరుద్యోగులకు-నిస్సంతులకు శుభము కలుగును. కోర్టు వ్యవహారములందు విజయములు.
**అనుకూల తేదీలు : 1,3,4,5,6,7,8,9,10,12,14,15,16,17,19,21,24,26,28.**

**అక్టోబర్ :** వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు సాఫీగా సాగును. శుభకార్యములు ఫలించును. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు లాభసాటిగా ఉండును.
**అనుకూల తేదీలు : 3,5,10,11,12,14,17,18,19,24,25,26,28,30,31.**

**నవంబర్ :** స్త్రీల సహకారములతో ముందుకు సాగుదురు. కళాకారులకు యోగించును. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు ఫలించును.
**అనుకూల తేదీలు : 1,2,6,8,9,11,15,16,18,22,23,25,29,30.**

**డిసెంబర్ :** శుభాశుభ మిశ్రమ ఫలితములు. అందుబాటుకు ధనము లభించును. దూర ప్రయాణములు చేయుదురు. స్వల్ప అస్వస్థత.
**అనుకూల తేదీలు : 6,7,9,11,13,14,16,18,20,21,22,23,27,28,29.**

**2020 జనవరి :** విద్యార్థులకు-స్త్రీలకు-శ్రామికులకు-వ్యాపారులకు-అవివాహితులకు-నిరుద్యోగులకు యోగించును. నూతన వస్తు-వస్త్ర ప్రాప్తి.
**అనుకూల తేదీలు : 3,4,5,6,10,11,12,13,15,17,18,22,24,25,29,31.**

**ఫిబ్రవరి :** నూతన ప్రయత్నములు చేయరాదు. ఇతరుల వ్యవహారములో తలదూర్చరాదు. మిత్రశతృత్వములు, శతృమిత్రత్వములు ఏర్పడును.
**అనుకూల తేదీలు : 10,11,18,25.**

**మార్చ్ :** పాతబాకీలు వచ్చును. మిత్రుల సహకారములు కలుగును. రాజకీయముగా మేలు జరుగును. మధ్యవర్తిత్వములు చేయరాదు.
**అనుకూల తేదీలు : 3,9,10,15,17,22,23,29.**

వృశ్చికరాశి వారికి ఈ సంవత్సరము ఉత్తరార్ధము నుండి యోగించును.





# 8. వృశ్చిక రాశి



విశాఖ-4వపాదము, అనురాధ-4పాదములు, జ్యేష్ఠ-4పాదములందు పుట్టినవారు మరియు "తో, నా, ని, నూ, నే, నో, యా, యీ, యూ" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "వృశ్చికరాశి"కి చెందినవారు.

**రాబడి - 14** **పోబడి - 14** **కీర్తి - 3** **అపకీర్తి - 1**

ఈ సంవత్సరము వీరికి ఆదాయ-వ్యయములు సమానముగా ఉండి, సమాజములో నూటికి **75**మంది అనుకూలముగాను, **25**మంది ప్రతికూలముగాను ఉందురు. సంవత్సర ప్రథమార్ధము గత సంవత్సరము వలె అన్ని విధములా సమస్యలతో సాగును. శారీరక-ఆర్థిక-మానసిక-రాజకీయ పరమైన ఒత్తిళ్ళు అధికమగును. ప్రయాణములందు-వాహన సారథ్యము నందు మెలకువగా ఉండవలెను. అపరిచితులను నమ్మరాదు. అనవసర విషయములలో తలదూర్చరాదు. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలందు భారీ పెట్టుబడులు పెట్టరాదు. బంధువులతోను, సోదర-సోదరీలతోను కలహములు వచ్చును. భూమి-గృహనిర్మాణాది పనులందు ఆటంకములు కలుగును. సంవత్సర ద్వితీయార్ధము నుండి క్రమేపి అభివృద్ధి పథములో ముందుకు సాగెదరు. వృత్తి-ఉద్యోగ-వ్యాపారములందు సానుకూల పరిస్థితులు ఉంటాయి. నూతనముగా చేయు శుభప్రయత్నములు సిద్ధించును.

ఈ రాశి **స్త్రీలకు** శారీరక-మానసిక సమస్యలు వేధించును. కలహములకు దూరముగా ఉండవలెను. నవంబర్ నుండి అవివాహితులకు మేలు.

**విద్యార్థులకు** ప్రతికూల కాలము. చదువు యెడల శ్రద్ధ అవసరము. ప్రమాదకర వ్యక్తులకు-ప్రదేశములకు-వస్తువులకు దూరముగా ఉండాలి.

**ఉద్యోగులకు** అనుకూలకాలము కాదు. అధికారులతో పేచీలు వచ్చును. ఇంక్రిమెంట్లు-ప్రమోషన్లు యందు ఆటంకములు ఉంటాయి.

**వ్యాపారులకు** ప్రతికూలకాలము. మ్యారేజ్‌బ్యూరోలకు, దళారులకు, లిక్కర్ వ్యాపారులకు, జూదగృహములు నడుపువారికి, స్మగుల్డ్ గూడ్స్ విక్రయించువారికి, విషవైద్యులకు, భూతవైద్యులకు, మంత్రగాళ్ళకు, డ్రగ్స్ వ్యాపారులకు, భీమావ్యాపారులకు, రెస్టారెంట్లు నడుపువారికి లాభించును.

**విశాఖా నక్షత్రజులకు** కుటుంబకలహములు, శారీరక బుగ్మతలు. **అనురాధా నక్షత్రజులకు** విపత్తులు, సానుభూతికర సంఘటనలు, చోరభీతి. **జ్యేష్ఠా నక్షత్రజులకు** శుభకార్య ప్రయత్నములు. పెద్దల అనుగ్రహములు.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 9.** ఈసంవత్సరము **విశాఖకు-8, అనురాధకు-4, జ్యేష్ఠకు-3** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **కోదండరాముడ్ని** నిత్యము పూజించుట వలన శారీరక-మానసిక-ఆర్థిక ప్రశాంతతలు కలుగును.



మే-జూన్-జూలై-ఆగస్ట్-అక్టోబర్ నెలలందు జాగ్రత్తగా ఉండవలెను.



**2019ఏప్రిల్ :** విద్యార్థులకు-స్త్రీలకు-కళాకారులకు యోగించును. పాడి-పంట-చెఱువులు సామాన్యముగా ఫలించును. పాత బాకీలు వసూలగును.
**అనుకూల తేదీలు : 1,3,4,8,10,11,12,18,19,21,22,26,28.**

**మే :** భారీ పెట్టుబడులు పెట్టరాదు. అనవసర ధనవ్యయములు చేయుదురు. స్థానచలనములు ఉండును. మధ్యవర్తిత్వములు చేయరాదు. గ్రహశాంతి.
**అనుకూల తేదీలు : 3,5,6,8,10,12,13,15,20.**

**జూన్ :** విద్యార్థులకు-వ్యాపారులకు సామాన్య కాలము. ప్రమాదకర వస్తువులకు దూరముగా ఉండాలి. వాహన సారథ్యములో జాగ్రత్త అవసరము.
**అనుకూల తేదీలు : 3,5,10,12,17,19.**

**జూలై :** వ్యసనానందములు-పరస్త్రీ వ్యామోహములు ఉండును. స్త్రీల సహకారములు కలుగును. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు లాభించవు.
**అనుకూల తేదీలు : 1,5,8,12,19,26,29,31.**

**ఆగస్ట్ :** నూతన ప్రయత్నములు చేయరాదు. అవివాహితులకు ఒకింత అనుకూల కాలము. అనవసర వ్యవహారములలో తలదూర్చరాదు.
**అనుకూల తేదీలు : 2,5,9,16,18,25,28.**

**సెప్టెంబర్ :** విద్యార్థులకు-వ్యాపారులకు-స్త్రీలకు-కళాకారులకు యోగించును. అవివాహితులకు-నిరుద్యోగులకు మేలు జరుగును. బంధుదర్శనము
**అనుకూల తేదీలు : 1,2,4,8,11,13,15,18,20,22,25,27,29,30.**

**అక్టోబర్ :** శుభాశుభమిశ్రమ కాలము. ధైర్యోత్సాహములతో ముందుకు సాగెదరు. సోదర-సోదరీల సహకారములు కలుగును. శతృమిత్రత్వములు.
**అనుకూల తేదీలు : 1,4,6,7,8,13,15,22,29.**

**నవంబర్ :** శుభకార్య ప్రయత్నములు ఫలించును. అందుబాటుకు ధనము లభించును. భార్యాబిడ్డల వలన సంతోషము చేకూరును. దైవ దర్శనము.
**అనుకూల తేదీలు : 1,4,5,7,8,11,14,15,21,22,28,29.**

**డిసెంబర్ :** అవివాహితులకు-నిస్సంతులకు మేలు జరుగును. గతకాల సమస్యలు నివారణ అగును. కుటుంబ-సంతాన సౌఖ్యములు ఉండును.
**అనుకూల తేదీలు : 2,5,6,9,12,13,19,20,25,26,27,30.**

**2020 జనవరి :** నూతన వస్తు-వాహన-భూషణ ప్రాప్తి. దూర ప్రయాణములు చేయుదురు. కోర్టు వ్యవహారములందు విజయములు కలుగును.
**అనుకూల తేదీలు : 1,2,3,6,8,9,10,16,17,19,23,24,26,30,31.**

**ఫిబ్రవరి :** శుభసంఘటనలు. మంచివార్తలు వచ్చును. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు-వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు ఫలించును. అభీష్టసిద్ధి.
**అనుకూల తేదీలు : 1,2,3,5,6,7,8,9,10,12,13,14,15,17,19,20,21,22,26,27,28,29.**

**మార్చ్ :** దూర ప్రయాణములు చేయుదురు. విద్యార్థులకు-వ్యాపారులకు-స్త్రీలకు-రచయితలకు యోగించును. పాడి-పంట-చెఱువులు ఫలించును.
**అనుకూల తేదీలు : 2,4,5,7,9,11,12,14,16,18,19,21,24,25,26,28,30,31.**

## 9. ధనుస్సు రాశి

*మూల-4పాదములు, పూర్వాషాఢ-4పాదములు, ఉత్తరాషాఢ-1వపాదమునందు పుట్టినవారు మరియు "యే, యో, బా, బి, బూ, ధా, భా, ఢా, బే" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "ధనుసురాశి"కి చెందినవారు.*

**రాబడి - 2** | **పోబడి - 8** | **కీర్తి - 6** | **అపకీర్తి - 1**

ఈ సంవత్సరము వీరికి నూటికి **20** రూపాయిలు ఆదాయము గాను, **80** రూపాయిలు వ్యయముగాను, సమాజములో నూటికి **86**మంది అనుకూలముగాను, **14**మంది ప్రతికూలముగాను ఉందురు. శారీరక-ఆర్ధిక-మానసిక-సామాజిక-రాజకీయ సమస్యలచే ఇబ్బందులు పడుదురు. వృత్తి-ఉద్యోగ-వ్యాపార ఒత్తిడులు అధికమగును. పాడి-పంట-చెఋవులు-పరిశ్రమలు నష్టపడును. భారీగా పెట్టుబడులు పెట్టడము, అప్పులు చేయడము మంచిది కాదు. జీవితభాగస్వామితో కలహములు వచ్చును. కోర్టు వ్యవహారములకు దూరముగా ఉండుట మంచిది. స్వశరీర మరియు కుటుంబసభ్యుల ఆరోగ్య ము యెడల జాగ్రత్తగా ఉండవలెను. నిరుద్యోగులకు- అవివాహితులకు అనుకూలకాలము కాదు. మధ్యవర్తిత్వములు చేయరాదు. విలువైన వస్తువులను భద్రముగా ఉంచుకోవాలి. చోరాగ్నిభయములు కలుగును. దూరప్రయాణములందు, వాహన సారధ్యమునందు మెలకువగా ఉండాలి.

ఈ రాశి **స్త్రీలకు** శారీరక-మానసిక ప్రయాసలు ఉండును. ఇంటాబయటా కలహములు కలుగును. దైవపూజలు-గ్రహశాంతులు ఆవశ్యము.

**విద్యార్థులకు** ఆశించిన ఫలితములు ఉండవు. చాలా కష్టపడవలెను. ప్రమాదకర వస్తువులకు-ప్రదేశములకు-వ్యక్తులకు దూరముగా ఉండాలి.

**ఉద్యోగులకు** అధికారులతో పేచీలు వచ్చును. ఇంక్రిమెంట్లు-ప్రమోషన్లందు సమస్యలు ఏర్పడును. రాజకీయపరమైన వివాదములు కలుగును.

**వ్యాపారులకు** ప్రతికూల కాలము. ఆటోమోబైల్ షాపుల వారికి, స్వీట్ షాపుల వారికి, వివిధ యంత్రభాగములు విక్రయించువారికి, మందులు షాపుల వారికి, వస్త్ర వ్యాపారులకు, ఫైనాన్స్ వ్యాపారులకు, హార్డ్‌వేర్ మరియు సాఫ్ట్‌వేర్ వ్యాపారులకు, ప్రింటింగ్ ప్రెస్‌లవారికి అనుకూల కాలము.

**మూలా నక్షత్రజాలకు** ప్రమాదములు, కలహములు, విచారము. **పూర్వాషాఢా నక్షత్రజాలకు** చోరాగ్ని భయములు, కోర్టు వివాదములు, బంధనము. **ఉత్తరాషాఢా నక్షత్రజాలకు** దూర ప్రయాణములు, పెద్దల అనుగ్రహము.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 3.** ఈసంవత్సరము **మూలకు-9, పూర్వాషాఢకు-4, ఉత్తరాషాఢకు-2** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **శ్రీరాముణ్ని** నిత్యము పూజించుట వలన శారీరక-మానసిక-ఆర్ధిక పరమైన సమస్యలు దూరమగును.





**2019 ఏప్రిల్ :** శుభాశుభ మిశ్రమ ఫలితములుండును. అవివాహితులకు-నిస్సంతులకు ఒకింత అనుకూల కాలము. సోదర-సోదరీల సహకారములు.
**అనుకూల తేదీలు : 2,5,9,12,16,17,19,23,24,26,29,30.**

**మే :** విద్యార్థులకు-స్త్రీలకు-వ్యాపారులకు యోగించును. శుభకార్య ప్రయత్నములు ఫలించును. పాడి-పంట-చెఋవులు-పరిశ్రమలు యోగించవు.
**అనుకూల తేదీలు : 1,3,6,7,10,17,19,22,24,26,27,29,31.**

**జూన్ :** మధ్యవర్తిత్వములు చేయరాదు. ప్రమాదకర వస్తువులకు-ప్రదేశములకు-వ్యక్తులకు దూరముగా ఉండాలి. భారీ పెట్టుబడులు పెట్టరాదు.
**అనుకూల తేదీలు : 2,3,9,24,26.**

**జూలై :** దూర ప్రయాణములు చేయుదురు. తల్లిద్వారా మంచి జరుగును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు సాఫీగా సాగును. అందుబాటుకు ధనలబ్ది.
**అనుకూల తేదీలు : 1,3,8,10,15,17,24,26,29.**

**ఆగస్ట్ :** అవివాహితులకు-నిరుద్యోగులకు అనుకూల కాలము. సమస్యలు పరిష్కారమగును. ప్రియవ్యక్తుల లేదా బంధుమిత్రుల సమాగము.
**అనుకూల తేదీలు : 2,5,7,9,12,14,16,21,23,26,30.**

**సెప్టెంబర్ :** శుభాశుభ మిశ్రమ కాలము. తోటల పెంపకము కలసివచ్చును. శుభకార్య ప్రయత్నములు ఫలించును. దూర ప్రయాణములు చేయుదురు.
**అనుకూల తేదీలు : 2,6,9,11,18,22,23,25,29,30.**

**అక్టోబర్ :** నూతన వస్తు-వస్త్ర-వాహన ప్రాప్తి. కోర్టు వ్యవహారములందు విజయములు. నూతన వ్యాపార ప్రయత్నములు. కృషికి తగిన ఫలితములు.
**అనుకూల తేదీలు : 2,6,9,11,13,16,18,20,21,23,25,27,28.**

**నవంబర్ :** విద్యార్థులకు-వ్యాపారులకు-టెక్నీషియన్స్‌కు అనుకూల కాలము పాడి-పంట-చెఋవులు-పరిశ్రమలు సామాన్యముగా ఫలించును. ఉత్తేజము.
**అనుకూల తేదీలు : 3,10,12,13,19,20,22,25,26,27,29.**

**డిసెంబర్ :** స్త్రీల సహకారములు. క్రయవిక్రయాదులు కలసి వచ్చును. భూసంబంధిత పనులు ముందుకు నడుచును. సోదర సహకారములు.
**అనుకూల తేదీలు : 3,4,6,10,13,17,20,23,24,27.**

**2020 జనవరి :** విద్యార్థులకు-స్త్రీలకు-వ్యాపారులకు అనుకూల కాలము. శత్రుమిత్రత్వములు ఉండును. అందుబాటుకు ధనము సర్దుబాటగును.
**అనుకూల తేదీలు : 3,10,15,17,22,24,27,29,31.**

**ఫిబ్రవరి :** భారీ పెట్టుబడులు పెట్టరాదు. ఋణ సౌకర్యములు చేకూరును. ఇతరుల వ్యవహారములలో జోక్యము చేసుకోరాదు. గ్రహశాంతి ఆవశ్యము.
**అనుకూల తేదీలు : 3,7,14,16,21,23,24,28.**

**మార్చ్ :** శుభాశుభ మిశ్రమ ఫలితములుండును. భారీ పెట్టుబడులు పెట్టరాదు. వాహన సారధ్యములో జాగ్రత్తగా ఉండవలెను. ప్రయాణములు.
**అనుకూల తేదీలు : 1,2,6,8,13,20,27,30.**

మకరరాశి వారికి ఈ సంవత్సరము ప్రథమార్ధము అనుకూలకాలము.





# 10. మకర రాశి ♑

*ఉత్తరాషాఢ-2,3,4పాదములు,శ్రవణం-4పాదములు,ధనిష్ఠ-1,2 పాదములందు పుట్టినవారు మరియు"బో,జా,జి,జూ,జే,జో,ఖ,గా,గీ" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు"మకరరాశి"కి చెందినవారు.*

**రాబడి - 5** | **పోబడి - 2** | **కీర్తి - 2** | **అపకీర్తి - 4**

ఈ సంవత్సరము వీరికి నూటికి **71** రూపాయిలు ఆదాయము గాను, **29** రూపాయిలు వ్యయముగాను, సమాజములో నూటికి **33**మంది అనుకూలముగాను, **67**మంది ప్రతికూలముగాను ఉందురు. సంవత్సర ప్రథమార్ధము సామాన్యఫలితములు ఉంటాయి. నిరుద్యోగులకు-నిస్సంతులకు-అవివాహితులకు ఒకింత అనుకూలకాలము. వ్యయప్రయాసలచే శుభకార్యములు నిర్వహించెదరు. భూమి-గృహనిర్మాణాది పనులు నిదానముగా సాగును. ఇతరుల వ్యవహారములలో తలదూర్చరాదు. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు సామాన్యముగా ఫలించును. రచయితలకు-పండితులకు-ఉపాధ్యాయులకు రాణించును. సంవత్సర ద్వితీయార్ధమునుండి స్వశరీర మరియు కుటుంబసభ్యుల ఆరోగ్యము యెడల శ్రద్ధ అవసరము. ఉదర-హృదయ-నరముల మరియు మూత్రకోశ సంబంధిత సమస్యలు ఇబ్బంది పెట్టును. వాహన అధిరోహణమునందు జాగ్రత్తగా ఉండవలెను. గ్రహశాంతి అవసరం.

ఈ రాశి **స్త్రీలకు** వస్తు-వస్త్ర-భూషణ సౌఖ్యములు కలుగును. సంవత్సర ద్వితీయార్ధము నుండి ఆరోగ్యము ఎడల శ్రద్ధ అవసరము. దైవ దర్శనములు

**విద్యార్థులకు** ఉత్తమ ఫలితములు కలుగును. ఉపకార వేతనములు లభించును. దూర దేశ ప్రయాణములు. పరిశోధనాత్మక విద్యా లాభములు.

**ఉద్యోగులకు** సామాన్య కాలము. వ్యయ-ప్రయాసలు అధికమగును. అనుకున్న ప్రదేశములకు బదలీలు జరుగును. వేతనములు పెరుగును.

**వ్యాపారులకు** సామాన్య కాలము. కాస్మోటిక్స్ వ్యాపారులకు, వస్త్ర వ్యాపారులకు, కిరాణా&జనరల్ వర్తకులకు, వడ్డీ వ్యాపారులకు, కార్ఖానా షాపుల వారికి, సెల్‌ఫోన్ షాపులవారికి, నగల వర్తకులకు, పబ్లికేషన్స్ వారికి, గృహ నిర్మాణా సామాగ్రి విక్రయించువారికి, రియల్ ఎస్టేట్స్ వారికి మేలు.

**ఉత్తరాషాఢా నక్షత్రజాలకు** అనారోగ్యము, కార్యవిలంబనములు, కలహములు. **శ్రవణా నక్షత్రజాలకు** ఆర్థిక-శారీరక-మానసిక-కుటుంబ సమస్యలు **ధనిష్టా నక్షత్రజాలకు** చోర భయము, పనులందు జాప్యము, మోసములు.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 8.** ఈసంవత్సరము **ఉత్తరాషాఢకు-9, శ్రవణముకు-9, ధనిష్టకు-4** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని** పూజించుట వలన శారీరక-ఆర్థిక-మానసిక-కుటుంబ సమస్యలు నివృత్తియగును.



జూలై-ఆగస్ట్-ఫిబ్రవరి నెలలందు జాగ్రత్తగా ఉండవలెను.



**2019 ఏప్రిల్ :** స్త్రీలకు-అవివాహితులకు మేలు జరుగును. దూర ప్రయాణములు చేయుదురు. శుభకార్యములు-ఉద్యోగప్రయత్నములు ఫలించును.
**అనుకూల తేదీలు : 1,3,5,7,10,12,14,15,19,22,25,26.**

**మే :** భూమి-గృహమునకు సంబంధించిన పనులు ముందుకు సాగును. శుభవార్తలు వచ్చును. విలువైన వస్తువులను కొంటారు. దైవ సందర్శనములు
**అనుకూల తేదీలు : 2,3,8,9,10,14,15,16,17,20,21,23,24,28,30,31.**

**జూన్ :** విద్యార్థులకు-ఉద్యోగులకు-వ్యాపారులకు-స్త్రీలకు-రచయితలకు అనుకూల కాలము. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు ఫలించును.
**అనుకూల తేదీలు : 4,5,6,7,11,12,13,14,16,17,18,19,20,21,23,27,28,30.**

**జూలై :** శుభాశుభ మిశ్రమ ఫలితములుండును. భారీ పెట్టుబడులు పెట్టరాదు. మధ్యవర్తిత్వములు చేయరాదు. ప్రమాదకర వస్తువులకు దూరము.
**అనుకూల తేదీలు : 4,7,11,14,18,22,25,31.**

**ఆగస్ట్ :** అందుబాటుకు ధనము సర్దుబాటగును. బంధుమిత్ర సహకారములు. పనులందు జాప్యములుండును. ఆరోగ్యము ఎడల శ్రద్ధ అవసరం.
**అనుకూల తేదీలు : 1,8,15,19,22,23,26,28,29,30.**

**సెప్టెంబర్ :** అవివాహితులకు-నిరుద్యోగులకు-నిస్సంతులకు శుభము కలుగును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు సాఫీగా నడుచును. రాజకీయ మేలు.
**అనుకూల తేదీలు : 4,5,6,12,13,16,19,20,23,26,27.**

**అక్టోబర్ :** దూర ప్రయాణములు చేయుదురు. శుభకార్య ప్రయత్నములు ఫలించును. బంధు-మిత్ర సందర్శనములు. ప్రియవ్యక్తులతో ఇష్టాగోష్ఠి.
**అనుకూల తేదీలు : 2,3,4,7,9,10,14,16,17,20,21,23.24,27,28,30,31.**

**నవంబర్ :** వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులలో మేలు జరుగును. నూతన వస్తు-వస్త్ర-వాహన-భూషణ ప్రాప్తి. ఆకస్మిక ధనలాభములు. స్థానచలనము.
**అనుకూల తేదీలు : 1,3,4,6,8,10,13,15,17,18,20,24,25,27.**

**డిసెంబర్ :** శుభాశుభ మిశ్రమ ఫలితములుండును. అనవసర ధనవ్యయములు. రాబడికి మించిన ఖర్చులు. పనులందు జాప్యములు. అనారోగ్యము.
**అనుకూల తేదీలు : 1,2,4,8,11,15,16,18,20,23,27,30,31.**

**2020 జనవరి :** పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు ఫలించును. అందుబాటుకు ధనము లభించును. సోదర-సోదరీల సహకారములు. స్థిరాభివృద్ధి.
**అనుకూల తేదీలు : 3,7,10,13,14,17,20,21,24,28,31.**

**ఫిబ్రవరి :** విద్యార్థులకు-స్త్రీలకు-కళాకారులకు యోగించును. పాడి-పంట-చెఱువులు అంతగా ఫలించవు. స్త్రీల సహకారములు కలుగును. ఋణలబ్ధి.
**అనుకూల తేదీలు : 4,5,7,12,14,17,19,21,26,28.**

**మార్చ్ :** దూర ప్రయాణములు చేయుదురు. బంధు-మిత్ర సందర్శనములు-సహకారములు. నూతన వ్యాపార ప్రయత్నములు. ఉద్యోగప్రాప్తి.
**అనుకూల తేదీలు : 4,6,11,13,15,16,18,20,22,23,25,27,29.**

## 11. కుంభ రాశి

ధనిష్ఠ-3,4పాదములు, శతభిషము-4పాదములు, పూర్వాభాద్ర-1,2,3 పాదములందు పుట్టినవారు మరియు "గూ,గే,గో,సా,సీ,సు, సే,సో,దా" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "కుంభరాశి"కి చెందినవారు.

**రాబడి - 5** | **పోబడి - 2** | **కీర్తి - 5** | **అపకీర్తి - 4**

ఈ సంవత్సరము వీరికి నూటికి **71** రూపాయిలు ఆదాయము గాను, **29** రూపాయిలు వ్యయముగాను, సమాజములో నూటికి **56**మంది అనుకూలముగాను, **44**మంది ప్రతికూలముగాను ఉందురు. సంవత్సరమంతయూ శుభాశుభ మిశ్రమఫలితములు ఉంటాయి. ఆర్థిక-ఆరోగ్య సమస్యలు ఉన్ననూ నిదానముగా అనుకున్న పనులను పూర్తిచేయుటకు ప్రయత్నించెదరు. అందుబాటుకు ధనము సర్దుబాటు అగును. స్వశరీర మరియు కుటుంబసభ్యుల ఆరోగ్యము యెడల శ్రద్ధగా ఉండవలెను. మానసిక ఒత్తిడులు లేదా భవిష్యత్తు గురించి ఆందోళనలు ఉండును. అవివాహితులకు-నిరుద్యోగులకు-నిస్సంతులకు మేలు జరుగును. దూర ప్రయాణములు చేయుదరు. నూతన వస్తు-వస్త్ర-భూషణ లాభములు కలుగును. పాడి-పంట-చెఱువులు యోగించును. 2020 జనవరి 25 నుండి ఏల్నాటిశని ప్రారంభము అగుటచే అచటి నుండి నూతనముగా భారీ ప్రయత్నములు చేయకుండుట మంచిది.

ఈ రాశి **స్త్రీలకు** శారీరక-మానసిక ఒత్తిడులు ఉంటాయి. ప్రశాంత జీవనముకై ప్రయత్నింతురు. అవివాహితులకు-నిస్సంతులకు యోగించును.

**విద్యార్థులకు** అనుకూలకాలము. దూరప్రయాణములు చేయుదురు. సంవత్సరాంతమునుండి ప్రమాదకర ప్రదేశములకు దూరముగా ఉండాలి.

**ఉద్యోగులకు** అనుకూలకాలము. ఆశించిన పనులు నెరవేరును. ఋణ సదుపాయములు-వేతనపెంపు-అధికారుల అనుగ్రహములు లాభించును.

**వ్యాపారులకు** యోగించును. ఎలక్ట్రికల్-ఎలక్ట్రానిక్స్ వారికి, అపరాల వర్తకులకు, ఇనుము-కంకర-మట్టి వ్యాపారులకు, దళారులకు, మందుల షాపుల వారికి, మిఠాయి వర్తకులకు, వడ్డీ వ్యాపారులకు, జల వ్యాపారులకు, పేపరు వర్తకులకు, పశు విక్రయదారులకు, ట్రావెల్స్ వారికి అనుకూలము.

**ధనిష్ఠా నక్షత్రజాలకు** పనులందు జాప్యము, అనారోగ్యము, బద్ధకము. **శతభిషా నక్షత్రజాలకు** ధనలాభము, నూతన మైత్రీలాభములు, బంధుదర్శనము. **పూర్వాభాద్ర నక్షత్రజాలకు** మిత్రశత్రుత్వములు, అధికారులతో పేచీ.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 8.** ఈసంవత్సరము **ధనిష్టకు-8, శతభిషముకు-3, పూర్వాభాద్రకు-9** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **ఈశ్వరుణ్ణి** నిత్యము ఆరాధించుట వలన ఆయురారోగ్యభాగ్యములు సిద్ధించును.





**2019 ఏప్రిల్ :** నిరుద్యోగులకు-అవివాహితులకు-నిస్సంతులకు మేలు. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు లాభించును. శుభకార్య ప్రయత్నజయములు.
**అనుకూల తేదీలు : 4,5,6,8,11,12,13,15,17,18,19,20,21,24,26,27,28,29.**
**మే :** పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు ఫలించును. దూర ప్రయాణములు చేయుదురు. శత్రుమిత్రత్వములు కలుగును. దైవ సందర్శనములు.
**అనుకూల తేదీలు : 1,3,4,5,10,11,12,13,17,18,20,22,24,25,27,29,31.**
**జూన్ :** కోర్టు వ్యవహారములందు విజయములు. నూతన వస్తు-వస్త్ర-భూషణ ప్రాప్తి. అందుబాటుకు ధనము లభించును. ధన-ధాన్య లాభములు.
**అనుకూల తేదీలు : 1,7,8,10,14,15,19,21,22,24,25,26,28,29.**
**జూలై :** విద్యార్థులకు-నిరుద్యోగులకు-అవివాహితులకు-వ్యాపారులకు-అధికారులకు అనుకూల కాలము. స్థిర-చరాస్తుల అభివృద్ధి. సోదర సహకారము.
**అనుకూల తేదీలు : 2,3,5,6,9,10,12,13,15,16,17,19,20,21,23,24,27,28,30.**
**ఆగస్ట్ :** శుభాశుభ మిశ్రమ ఫలితములు. నూతన విషయ పరిజ్ఞానము. బంధు-మిత్ర సహకారము. స్వశరీర మరియు కుటుంబ సభ్యులకు అస్వస్థత.
**అనుకూల తేదీలు : 3,4,6,7,10,11,13,14,17,21,24,31.**
**సెప్టెంబర్ :** వృత్తి-ఉద్యోగ-వ్యాపారులందు అభివృద్ధి. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు లాభించును. దూరము నుండి శుభవార్తలు వచ్చును.
**అనుకూల తేదీలు : 7,9,11,13,14,18,20,21,25,27,28.**
**అక్టోబర్ :** నూతన ప్రయత్నములు చేయరాదు. భారీగా పెట్టుబడులు పెట్టరాదు. సామాన్య ఫలితములు ఉండును. ప్రయాణములు ఉండును.
**అనుకూల తేదీలు : 4,5,11,12,18,19,25,26,30.**
**నవంబర్ :** అభీష్టవిజయములు. నూతన వస్తు-వస్త్ర-భూషణ-వాహన ప్రాప్తి. పాతబాకీలు వచ్చును. సామాజికముగా-రాజకీయముగా మేలు.
**అనుకూల తేదీలు : 2,6,7,9,11,14,16,17,18,21,22,23,24,28,29,30.**
**డిసెంబర్ :** శుభకార్యములు ఫలించును. శుభసంఘటనలు చోటుచేసుకొనును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులందు సంతోషము కలుగును.
**అనుకూల తేదీలు : 1,5,6,7,8,9,11,12,13,14,15,16,18,19,21,22,23,26,28,29.**
**2020 జనవరి :** ధన-ధాన్య లాభములు. అవివాహితులకు-స్త్రీలకు-నిస్సంతులకు శుభము కలుగును. స్థిరమైన విలువైన వస్తువులను సమకూర్చెదరు.
**అనుకూల తేదీలు : 1,2,4,5,6,8,9,10,11,12,13,16,17,18,20,23,24,25,27,30,31.**
**ఫిబ్రవరి :** పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు లాభించును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులు సాఫీగా సాగును. నూతన ప్రయత్నములు ఫలించును.
**అనుకూల తేదీలు : 6,7,10,11,13,14,17,18,20,21,24,25,27,28.**
**మార్చ్ :** సోదర-సోదరీల సహకారములు. క్రయవిక్రయాదులు కలసివచ్చును. వాస్తు మార్పులు చేయుదురు. ఆరోగ్యము ఎడల శ్రద్ధ అవసరము.
**అనుకూల తేదీలు : 3,5,6,9,10,12,13,16,17,19,20,26,27.**

మీనరాశి వారికి ఈ సంవత్సరము అదృష్టప్రదముగా ఉండును.





# 12. మీన రాశి



*పూర్వాభాద్ర-4వపాదము, ఉత్తరాభాద్ర-4పాదములు, రేవతి-4పాదములయందు పుట్టినవారు మరియు "ది,దు,శ్యం,ఝా,థా,దే,దో,చా,చి" అను అక్షరములు తమ పేరునకు ముందుగలవారు "మీనరాశి"కి చెందినవారు.*

**రాబడి - 2** | **పోబడి - 8** | **కీర్తి - 1** | **అపకీర్తి - 7**

ఈ సంవత్సరము వీరికి నూటికి **20** రూపాయిలు ఆదాయము గాను, **80** రూపాయిలు వ్యయముగాను, సమాజములో నూటికి **12**మంది అనుకూలముగాను, **88**మంది ప్రతికూలముగాను ఉందురు. మెరుగైన ప్రగతి ఉంటుంది. శుభకార్య ప్రయత్నములు సిద్ధించును. వృత్తి-ఉద్యోగ-వ్యాపార నిర్వహణలు నింపాదిగా అభివృద్ధి పథములో సాగును. పాడి-పంట-చెఱువులు-పరిశ్రమలు లాభించును. దూరదేశ ప్రయాణములు చేయుదురు. మీ కృషికి తగిన గుర్తింపు లభ్యమగును. బంధుమిత్ర సహకారములు ఉండును. అవివాహితులకు-నిరుద్యోగులకు-నిస్సంతులకు యోగించును. రాజకీయముగా లబ్ధి కలుగును. పుణ్యక్షేత్రాది ఆలయ సందర్శనములు చేయుదురు. పండితులకు-రచయితలకు-కళాకారులకు సన్మానసత్కారములుండును. భూమి-గృహ-వాహన యోగములు చేకూరును. రావలసిన పాత బాకీలు వసూలు అగును. నూతన లేదా నిగూఢ విద్యలయందు ఆసక్తి కలుగును.

ఈ రాశి **స్త్రీలకు** శారీరక-మానసిక ప్రశాంతత కలుగును. నూతన వస్తు-వస్త్ర-భూషణ లాభములుండును. ప్రయత్నకార్యజయములు.

**విద్యార్ధులకు** శుభఫలితములు ఉండును. శాస్త్రీయ-భాషా విద్యార్ధులకు మేలుగా ఉండును. దూరప్రయాణములు చేయుదురు. గుర్తింపు ఉంటుంది.

**ఉద్యోగులకు** అనుకూలకాలము. ప్రమోషన్లు-ఇంక్రిమెంట్లు వచ్చును. అనుకున్న ప్రదేశములకు బదిలీలు జరుగును. అధికారుల అనుగ్రహము.

**వ్యాపారులకు** యోగించును. ట్రావెల్స్ నిర్వాహకులకు, మెడికల్ షాపుల వారికి, మీడియా వ్యాపారులకు, విద్యా-వైద్య వ్యాపారులకు, కిరాణా వర్తకులకు, పండ్ల వ్యాపారులకు, స్మగుల్డ్ గూడ్స్ విక్రయించువారికి, స్వీటు షాపులకు, పూజాసామాగ్రి విక్రేతలకు, లెదర్‌గూడ్స్ విక్రయించువారికి మేలు.

**పూర్వాభాద్ర నక్షత్రజులకు** దైవదీక్షలు. పుణ్యక్షేత్ర సందర్శనములు.
**ఉత్తరాభాద్ర నక్షత్రజులకు** నేత్ర-శిరో-హృదయ రుగ్మతలు. సంచారము.
**రేవతి నక్షత్రజులకు** ప్రశాంత జీవనము-శుభకార్యసిద్ధి-దైవ సందర్శనము.

ఈ రాశివారికి **అదృష్టసంఖ్య 3.** ఈసంవత్సరము **పూర్వాభాద్రకు-7, ఉత్తరాభాద్రకు-1, రేవతికి-2** సంఖ్యలు అదృష్టప్రదముగా ఉండును.

ఈ రాశివారు ఈసంవత్సరము **మహాగణపతిని** నిత్యము పూజించుట వలన శారీరక-మానసిక-ఆర్థిక పరమైన సమస్యలు దూరమగును.



నవంబర్-డిసెంబర్ నెలలందు నూతన ప్రయత్నములు చేయరాదు.



**2019 ఏప్రిల్ :** అందుబాటుకు ధనము సర్దుబాటగును. తండ్రి వలన మేలు కలుగును. నూతన ప్రయత్నములు చేయరాదు. వాహన ప్రమాదము.
**అనుకూల తేదీలు : 1,2,9,16,19,23,25,26,30.**

**మే :** ఆకస్మిక ధనలాభములు. ఉద్యోగ బదిలీలు. శుభవార్తలు వచ్చును. శుభకార్య ప్రయత్నములు ఫలించును. అవివాహితులకు మేలు కలుగును.
**అనుకూల తేదీలు : 2,3,6,7,8,9,10,13,15,16,17,19,23,24,26,30,31.**

**జూన్ :** నూతన వస్తు-వస్త్ర-భూషణ-వాహన ప్రాప్తి. విద్యార్ధులకు-స్త్రీలకు-పండితులకు మేలు కలుగును. పాడి-పంట-చెఱువులు లాభించును.
**అనుకూల తేదీలు : 2,3,5,6,7,9,10,12,13,14,19,20,21,27,28.**

**జూలై :** నిస్సంతులకు-నిరుద్యోగులకు-అవివాహితులకు-స్త్రీలకు-ఉపాధ్యాయులకు-కళాకారులకు శుభము కలుగును. వృత్తి-ఉద్యోగ సౌఖ్యములు.
**అనుకూల తేదీలు : 1,4,5,8,11,12,15,18,19,22,25,26,29,31.**

**ఆగస్ట్ :** సన్మాన-సత్కారములు. దూర ప్రయాణములు. దైవ సందర్శనములు. రావలసిన బాకీలు వసూలగును. భూమి-గృహ క్రయవిక్రయాదులు.
**అనుకూల తేదీలు : 1,2,5,8,9,12,13,15,16,18,19,20,22,25,27,28,29.**

**సెప్టెంబర్ :** వృత్తి-ఉద్యోగ-వ్యాపారము లందు పురోభివృద్ధి. నిస్సంతులకు యోగించును. దూర ప్రయాణములు చేయుదురు. అందుబాటుకు ధనలబ్ధి.
**అనుకూల తేదీలు : 1,2,3,4,5,8,9,10,12,15,16,17,19,24,26,30.**

**అక్టోబర్ :** విద్యార్ధులకు-వ్యాపారులకు-స్త్రీలకు-కళాకారులకు-పండితులకు మంచి జరుగును. పాడి-పంట-చెఱువులు లాభించును. శుభకార్య సిద్ధి.
**అనుకూల తేదీలు : 2,3,7,9,10,11,14,16,17,18,23,24,25,31.**

**నవంబర్ :** నూతన ప్రయత్నములు చేయరాదు. భారీగా పెట్టుబడులు పెట్టరాదు. అపరిచితులను నమ్మరాదు. మధ్యవర్తిత్వములు చేయరాదు.
**అనుకూల తేదీలు : 1,4,8,13,15,20,27.**

**డిసెంబర్ :** పనులు మందముగా సాగును. ఆదాయమునకు మించిన ఖర్చులు ఉండును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాదులందు సమస్యలు ఉండును.
**అనుకూల తేదీలు : 2,4,20,22,25,27,29,30.**

**2020 జనవరి :** శుభాశుభ మిశ్రమ ఫలితములుండును. విద్యార్ధులకు-అవివాహితులకు-వ్యాపారులకు యోగించును. ఋణ సౌకర్యములు.
**అనుకూల తేదీలు : 1,3,5,8,12,15,19,22,26,29.**

**ఫిబ్రవరి :** ఆకస్మిక లాభములు. నూతన ప్రయత్నములు ఫలించును. అందుబాటుకు ధనము లభించును. గృహనిర్మాణాది పనులు సాగును.
**అనుకూల తేదీలు : 1,2,3,7,8,9,10,14,15,21,22,28,29.**

**మార్చ్ :** ప్రశాంత జీవనము. పెద్దల అనుగ్రహము. శుభవార్తలు వచ్చును. పాడి-పంట-చెఱువులు సామాన్యముగా ఫలించును. స్థానచలనములు.
**అనుకూల తేదీలు : 2,6,7,9,13,14,20,21,23,24,27,28,30,31.**

వృశ్చిక-ధనుస్సురాశుల్లో గురు సంచారము ఆంధ్రప్రదేశ్‌కు మంచిదికాదు.



## దృగ్గణిత గ్రహములతో కూడిన సవ్య రాశిచక్రములు

| | | | |
|---|---|---|---|
| మీన | మేష | వృష | మిథు |
| కుంభ | 12రాశుల | | కర్కా |
| మక | సవ్యచక్రం | | సింహ |
| ధను | వృశ్చి | తుల | కన్య |

| | | | |
|---|---|---|---|
| ర చ | | కు | రా |
| బు శు | 6-04-2019 | | |
| | శని | | |
| శ కే గు | | | |

| | | | |
|---|---|---|---|
| ర | చ | కు | రా |
| బు శు | 8-04-2019 | | |
| | సోమ | | |
| శ కే గు | | | |

| | | | |
|---|---|---|---|
| ర | | చకు | రా |
| బు శు | 10-04-2019 | | |
| | బుధ | | |
| శ కే గు | | | |

| | | | |
|---|---|---|---|
| ర | | కు | చరా |
| బు శు | 12-04-2019 | | |
| | శుక్ర | | |
| శ కే గు | | | |

| | | | |
|---|---|---|---|
| ర బు | | కు | రా |
| శు | 14-04-2019 | | చ |
| | ఆది | | |
| శ కే గు | | | |

| | | | |
|---|---|---|---|
| బుశు | ర | కు | రా |
| | 16-04-2019 | | |
| | మంగళ | | చ |
| శ కే గు | | | |

| | | | |
|---|---|---|---|
| బుశు | ర | కు | రా |
| | 18-04-2019 | | |
| | గురు | | |
| శ కే గు | | | చ |

| | | | |
|---|---|---|---|
| బుశు | ర | కు | రా |
| | 20-04-2019 | | |
| | శని | | |
| శ కే | గు | చ | |

| | | | |
|---|---|---|---|
| బుశు | ర | కు | రా |
| | 22-04-2019 | | |
| | సోమ | | |
| శ కే | గుచ | | |

| | | | |
|---|---|---|---|
| బుశు | ర | కు | రా |
| | 24-04-2019 | | |
| | బుధ | | |
| శ కే చ | గు | | |

| | | | |
|---|---|---|---|
| బుశు | ర | కు | రా |
| | 26-04-2019 | | |
| చ | శుక్ర | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| బుశు | ర | కు | రా |
| | 28-04-2019 | | |
| చ | ఆది | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| బుశు | ర | కు | రా |
| చ | 30-04-2019 | | |
| | మంగళ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| చ బుశు | ర | కు | రా |
| | 2-05-2019 | | |
| | గురు | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| శు | రచ బు | కు | రా |
| | 4-05-2019 | | |
| | శని | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| శు | రబు | చకు | రా |
| | 6-05-2019 | | |
| | సోమ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| శు | రబు | | చరా కు |
| | 8-05-2019 | | |
| | బుధ | | |
| శ కే | గు | | |



వృశ్చికరాశిలో గురు సంచారము తెలంగాణాకు మేలు చేయును.



## దృగ్గణిత గ్రహములతో కూడిన సవ్య రాశిచక్రములు

| | | | |
|---|---|---|---|
| శు | రబు | | రా కు |
| | 10-05-2019 | | చ |
| | శుక్ర | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | రబు శు | | రాకు |
| | 12-05-2019 | | చ |
| | ఆది | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | రబు శు | | రా కు |
| | 14-05-2019 | | |
| | మంగళ | | చ |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | బుశు | ర | రా కు |
| | 16-05-2019 | | |
| | గురు | | |
| శ కే | గు | | చ |

| | | | |
|---|---|---|---|
| | బుశు | ర | రా కు |
| | 18-05-2019 | | |
| | శని | | |
| శ కే | గు | చ | |

| | | | |
|---|---|---|---|
| | శు | రబు | రా కు |
| | 20-05-2019 | | |
| | సోమ | | |
| శ కే | చగు | | |

| | | | |
|---|---|---|---|
| | శు | రబు | రా కు |
| | 22-05-2019 | | |
| | బుధ | | |
| శ కే చ | గు | | |

| | | | |
|---|---|---|---|
| | శు | రబు | రా కు |
| | 24-05-2019 | | |
| చ | శుక్ర | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | శు | రబు | రా కు |
| చ | 26-05-2019 | | |
| | ఆది | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | శు | రబు | రా కు |
| చ | 28-05-2019 | | |
| | మంగళ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| చ | శు | రబు | రా కు |
| | 30-05-2019 | | |
| | గురు | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | చశు | రబు | రా కు |
| | 1-06-2019 | | |
| | శని | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | శు | రచ | బురా కు |
| | 3-06-2019 | | |
| | సోమ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | రశు | బురా చకు |
| | 5-06-2019 | | |
| | బుధ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | రశు | బురా కు |
| | 7-06-2019 | | చ |
| | శుక్ర | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | రశు | బురా కు |
| | 9-06-2019 | | |
| | ఆది | | చ |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | రశు | బురా కు |
| | 11-06-2019 | | |
| | మంగళ | | |
| శ కే | గు | | చ |

| | | | |
|---|---|---|---|
| | | రశు | బురా కు |
| | 13-06-2019 | | |
| | గురు | | |
| శ కే | గు | చ | |

ధనుస్సురాశిలో గురు సంచారము తెలంగాణాకు మంచిది కాదు.



## దృగ్గణిత గ్రహములతో కూడిన సవ్య రాశిచక్రములు

| | | | |
|---|---|---|---|
| | | రశు | కుబు రా |
| | 15-06-2019 | | |
| | శని | | |
| శ కే | చగు | | |

| | | | |
|---|---|---|---|
| | | శు | రకు బురా |
| | 17-06-2019 | | |
| | సోమ | | |
| శ కే | చగు | | |

| | | | |
|---|---|---|---|
| | | శు | రబు కురా |
| | 19-06-2019 | | |
| | బుధ | | |
| చ శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | శు | రకు రా |
| | 21-06-2019 | | బు |
| చ | శుక్ర | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | శు | రరా |
| చ | 23-06-2019 | | కుబు |
| | ఆది | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| చ | | శు | రరా |
| | 25-06-2019 | | కుబు |
| | మంగళ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| చ | | శు | రరా |
| | 27-06-2019 | | కుబు |
| | గురు | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | చ | | రశు రా |
| | 29-06-2019 | | కుబు |
| | శని | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | చ | రశు రా |
| | 1-07-2019 | | కుబు |
| | సోమ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రార చశు |
| | 3-07-2019 | | కుబు |
| | బుధ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రార శు |
| | 5-07-2019 | | చ కుబు |
| | శుక్ర | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రార శు |
| | 7-07-2019 | | కుబు |
| | ఆది | | చ |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రార శు |
| | 9-07-2019 | | కుబు |
| | మంగళ | | |
| శ కే | గు | | చ |

| | | | |
|---|---|---|---|
| | | | రార శు |
| | 11-07-2019 | | కుబు |
| | గురు | | |
| శ కే | గు | చ | |

| | | | |
|---|---|---|---|
| | | | రార శు |
| | 13-07-2019 | | కుబు |
| | శని | | |
| శ కే | చగు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రార శు |
| | 15-07-2019 | | కుబు |
| | సోమ | | |
| చ శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రార శు |
| | 17-07-2019 | | కుబు |
| చ | బుధ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రాశు |
| | 19-07-2019 | | రకు బు |
| చ | శుక్ర | | |
| శ కే | గు | | |



వృశ్చికరాశిలో గురుని సంచారము భారతదేశ ఖ్యాతిని పెంచును.



## దృగ్గణిత గ్రహములతో కూడిన సవ్య రాశిచక్రములు

| | | | |
|---|---|---|---|
| | | | రాశు |
| చ | 21-07-2019 | | రకు బు |
| | ఆది | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| ˊచ | | | రాబు శు |
| | 23-07-2019 | | రకు |
| | మంగళ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | చ | | రాబు |
| | 25-07-2019 | | రకు శు |
| | గురు | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | చ | రాబు |
| | 27-07-2019 | | రకు శు |
| | శని | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | చ | రాబు |
| | 29-07-2019 | | రకు శు |
| | సోమ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | చ రాబు |
| | 31-07-2019 | | రకు శు |
| | బుధ | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రాబు |
| | 2-08-2019 | | రకు చశు |
| | శుక్ర | | |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 4-08-2019 | | రకు శుబు |
| | ఆది | | చ |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 6-08-2019 | | రకు శుబు |
| | మంగళ | | |
| శ కే | గు | | చ |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 8-08-2019 | | రకు బుశు |
| | గురు | | |
| శ కే | గు | చ | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 10-08-2019 | | రబు శు |
| | శని | | కు |
| శ కే | చగు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 12-08-2019 | | రబు శు |
| | సోమ | | కు |
| శ కే చ | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 14-08-2019 | | రబు శు |
| చ | బుధ | | కు |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| చ | 16-08-2019 | | రబు శు |
| | శుక్ర | | కు |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| చ | 18-08-2019 | | బు |
| | ఆది | | రకు శు |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| చ | | | రా |
| | 20-08-2019 | | బు |
| | మంగళ | | రకు శు |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | చ | | రా |
| | 22-08-2019 | | బు |
| | గురు | | రకు శు |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | చ | రా |
| | 24-08-2019 | | బు |
| | శని | | రకు శు |
| శ కే | గు | | |

ధనుస్సురాశిలో గురు సంచారము భారతదేశమునకు శత్రుబెడద.



## దృగ్గణిత గ్రహములతో కూడిన సవ్య రాశిచక్రములు

| | | | |
|---|---|---|---|
| | | | చరా |
| | 26-08-2019 | | బు |
| | సోమ | | రకు శు |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 28-08-2019 | | చ |
| | బుధ | | రకు బుశు |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 30-08-2019 | | |
| | శుక్ర | | రచకు బుశు |
| శ కే | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 1-09-2019 | | |
| | ఆది | | రకు బుశు |
| శ కే | గు | | చ |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 3-09-2019 | | |
| | మంగళ | | రకు బుశు |
| శ కే | గు | చ | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 5-09-2019 | | |
| | గురు | | రకు బుశు |
| శ కే | చగు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 7-09-2019 | | |
| | శని | | రకు బుశు |
| శ కే చ | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 9-09-2019 | | |
| | సోమ | | రకు బుశు |
| శ కే చ | గు | | |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 11-09-2019 | | |
| చ | బుధ | | రకు బు |
| శ కే | గు | | శు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| చ | 13-09-2019 | | |
| | శుక్ర | | రకు |
| శ కే | గు | | బుశు |

| | | | |
|---|---|---|---|
| ´చ | | | రా |
| | 15-09-2019 | | |
| | ఆది | | రకు |
| శ కే | గు | | బుశు |

| | | | |
|---|---|---|---|
| | చ | | రా |
| | 17-09-2019 | | |
| | మంగళ | | రకు |
| శ కే | గు | | బుశు |

| | | | |
|---|---|---|---|
| | చ | | రా |
| | 19-09-2019 | | |
| | గురు | | కు |
| శ కే | గు | | రబు శు |

| | | | |
|---|---|---|---|
| | | చ | రా |
| | 21-09-2019 | | |
| | శని | | కు |
| శ కే | గు | | రబు శు |

| | | | |
|---|---|---|---|
| | | | చరా |
| | 23-09-2019 | | |
| | సోమ | | కు |
| శ కే | గు | | రబు శు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 25-09-2019 | | చ |
| | బుధ | | కు |
| శ కే | గు | | రబు శు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 27-09-2019 | | |
| | శుక్ర | | చ |
| శ కే | గు | | రకు బుశు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 29-09-2019 | | |
| | ఆది | | |
| శ కే | గు | | రచకు బుశు |



ధనుస్సురాశిలో శని సంచారముచే భారతదేశము శక్తివంతమగును.



## దృగ్గణిత గ్రహములతో కూడిన సవ్య రాశిచక్రములు

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 1-10-2019 | | |
| | మంగళ | | |
| శ కే | గు | చబు | రకు శు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 3-10-2019 | | |
| | గురు | | |
| శ కే | చగు | బు | రకు శు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 5-10-2019 | | |
| | శని | | |
| శ కే చ | గు | బుశు | రకు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 7-10-2019 | | |
| చ | సోమ | | |
| శ కే | గు | బుశు | రకు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 9-10-2019 | | |
| చ | బుధ | | |
| శ కే | గు | బుశు | రకు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| చ | 11-10-2019 | | |
| | శుక్ర | | |
| శ కే | గు | బుశు | రకు |

| | | | |
|---|---|---|---|
| చ | | | రా |
| | 13-10-2019 | | |
| | ఆది | | |
| శ కే | గు | బుశు | రకు |

| | | | |
|---|---|---|---|
| | చ | | రా |
| | 15-10-2019 | | |
| | మంగళ | | |
| శ కే | గు | బుశు | రకు |

| | | | |
|---|---|---|---|
| | | చ | రా |
| | 17-10-2019 | | |
| | గురు | | |
| శ కే | గు | బుశు | రకు |

| | | | |
|---|---|---|---|
| | | | చరా |
| | 19-10-2019 | | |
| | శని | | |
| శ కే | గు | రబు శు | కు |

| | | | |
|---|---|---|---|
| | | | చరా |
| | 21-10-2019 | | |
| | సోమ | | |
| శ కే | గు | రబు శు | కు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 23-10-2019 | | చ |
| | బుధ | | |
| శ కే | గు | రబు శు | కు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 25-10-2019 | | |
| | శుక్ర | | చ |
| శ కే | బుగు | రశు | కు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 27-10-2019 | | |
| | ఆది | | |
| శ కే | బుగు | రశు | చకు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 29-10-2019 | | |
| | మంగళ | | |
| శ కే | బుగు శు | రచ | కు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 31-10-2019 | | |
| | గురు | | |
| శ కే | బుగు చశు | ర | కు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 2-11-2019 | | |
| | శని | | |
| శ కే చ | బుగు శు | ర | కు |

| | | | |
|---|---|---|---|
| | | | రా |
| | 4-11-2019 | | |
| చ | సోమ | | |
| శ కే | బుగు శు | ర | కు |

